మిత్రుడు

వెంకటనారాయణునికి

# వి ష య సూ చి క



# బిల్హణ విలాసము*

(ప్రథమ తరంగము)

తే. మేరుగిరి కుత్తరంబుగ మేటిబుధులఁ
దనరి పాంచాల దేశంబు వినుతి కెక్క—
సార్థక మగులక్ష్మి మందిరాఖ్యపురము
రాజధానిగ మదనాభిరాముఁ డేలు. ౧

తే. సుదతి మందారమాల యనఁ సుగుణ భార్య
యతని హృదయంబు హరియించు టద్భుతంబె
వారిరువురకుఁ గలిగెఁ గుమారి యొక తె
యామినీ పూర్ణతిలక నాఖ్యాతి గలిగి. ౨

వ. ఆ బాలిక చంద్రకళవోలెఁ గ్రమక్రమ ప్రవర్ధమాన యగు
చున్నంత— ౩

సీ. పొంక మాంజన్వన మంకురించెనో లేదో
మధుర వాక్సౌభాగ్యమహిమ గలిగె
మధురవాక్సౌభాగ్యమహిమ గల్గెనో లేదో
ప్రాగల్భ్య గర్వంబు ప్రాప్త మయ్యెఁ
ప్రాగల్భ్య గర్వంబు ప్రాప్తమయ్యెనో లేదో
నెఱ వాల్కనులఁ జూచు నేర్పు గలిగె
నెఱవాల్కనులఁ జూచు నేర్పు గల్గెనో లేదో
స్తనములు కరికుంభసామ్య మొందె.

---

* ఇది 1928 సంవత్సరములో 19 వ యేట రచించిన రచన.

ఆ. స్తనములు కరికుంభసామ్య మొందెనో లేదొ
యల్లనల్ల నంచ ననుగమించె
నల్లనల్ల నంచ ననుగమించెనో లేదొ
రసిక మానసమున మొసలె నౌర ! ౪

చ. సలలిత మైనకీర్తనలఁ జక్కఁగఁ బాడుచు గానవార్ధి నిం
పలరఁగఁ బొంగఁజేయు నమృతాంశునిదీధితియయ్యు సాహితీ
విలసిత కాక యుంటఁ దనప్రేమపుఁ గూఁతును నాటకాదులన్
గళలను బ్రౌఢఁజేయుసమకట్టి యమాత్యునితో నృపుండనెన్.

తే. "మంత్రివర్య! గానంబును మనదు బాల
యామినీ పూర్ణతిలకమ్మ యభ్యసించె
యౌవనాంగి ప్రౌఢయు నైన యామె యిపుడు
సాహితీ విద్యమాత్రము చదువవలయు. ౫

కం. మొగ మంతయును విలోచన
యుగమే; యురమంతయును బయోధరయుగమే
గగనంబే నడు మంతయుఁ
దగునె యెవరి కైన నట్టి తరుణికిఁ జెప్పన్." ౬

చ. అనవుడు మంత్రి, "దేవర! సమగ్రులు పండితరాజు లెందఱో
మనపురి నున్నవారు తమమానస మొప్పినఁ బిల్వఁగాఁ
బనిచెదఁ జిత్తగింపుఁ"డని పార్థివుసమ్మతి నొంది శాస్త్రులో
ధనపరిపూర్ణులన్ సుచరితాత్ములఁ బూజ్యులఁబిల్చియంతటన్.

వ. వారిని నర్ఘ్యపాద్యాసనాదులఁ దగురీతి సత్కరించి "మీ
రేయేశాస్త్రములఁ బఠించితి రేయే విద్యలఁ బరిపూర్ణులైతి
రని యడుగుటయుఁ బండితు లిట్లనిరి. ౯

"విను మోపార్థివ! కర్మకాండములలో, వేదాంతశాస్త్రమ్ములన్
గణభుగ్గౌతమ శేషసూక్తికలనన్ గల్పంబులో నట్టి తీ
రున వేదంబునఁ దత్పదక్రమ జటారోహావరోహంబులన్
ఘనవాద ప్రథిమన్ బురాణతతి మా నైపుణ్య మీపాటిదే" ౧౦

చ. అన విని భూవిభుండు, బుధులార! మదీయకుమారి నిష్ఠ కా
వ్యనిపుణగా, రసజ్ఞగ సమంచితరీతి నలంకృతిజ్ఞగన్
బొనరుపుఁ డన్న మాకు రసబోధయె లేదు కవీశు లట్టివార
జననము నొందునే కవిత ఛాందసవంశమునందు భూవరా!

పితగా వ్యాకరణజ్ఞు నెంచివిడుచున్, బెద్దన్నగాఁ దార్కికున్
మతిఁదోలున్, నిరసించు మందుఁడని మీమాంసాప్రవీణాత్ము సం
తతమున్ బోవెలివేయు దూరముగ ఛండాలున్ బలెన్ ఛాందసున్
బతిఁగోరున్ గవితాకుమారి తనయంతన్ గావ్యతత్త్వజ్ఞునిన్

వ. అనియిట్లు పండిత ప్రకాండులు విన్నపంబుసేయఁ బిదప
నృపతి శేఖరుండు— ౧౩

క. "సరసాలంకృతి నిపుణుఁడు
వరకావ్యవిచక్షణుండు వాగ్మియు ఛందో
నిరతుఁడు నాటకతత్త్వం
బెఱిఁగిన కవితల్లజుఁ డిట నెవఁ"డని యడుగన్. ౧౪

తే. "కలరు మనపురి సరసు లౌకవు లిరువురు
వారు బిల్హణ మల్హణుల్ ప్రకటమతులు
అందు బిల్హణనాముని నవని బుధులు
కవివరేణ్యుఁగ నుడువుదు రవనినాథ ! ౧౫

సీ. భువి వస్త్రములలోన ధవళాంబరము మేలు
ఋతులలోన వసంతఋతువు మేలు
పూలలోపలఁ దావిఁబోదలు మల్లిక మేలు
ధన్వులలో సుమధన్వి మేలు
పరిమళంబులలోన హరిణమదము మేలు
శస్త్రాలలో శరాసనము మేలు
పల్కులలోఁ దర్కపదగుంభితము మేలు
సరసిజాస్యలలోన శ్యామ మేలు

గీ. ప్రాయములలోన నూత్న యౌవనము మేలు
ఆశ్రితజన రక్షకులలో హరుఁడు మేలు
శ్రుతులలోనఁ బంచమలయాన్వితము మేలు
పండితకవులలో బిల్హణుండు మేలు. ౧౬

గీ. ఇట్లు చెప్పఁగ విని మోద మెసకమెసఁగ
మున్ను కని విని యెఱుఁగము బుధుఁ డతండు
ఎచట నుండెనో యని మది నెంచి వారి
నడిగి బిల్హణుఁ బిలిపించె నపుడు నృపతి. ౧౭

గీ. బిల్హణ కవీంద్రుఁ డేతెంచి విబుధులెల్ల
గూడినసుధర్మమనియెడు కొలువు చొచ్చి
నృపతి నాశీర్వదించెఁ జేయెత్తి యంత
నమర విభుని బృహస్పతి యట్టు లెలమి. ౧౯

వ. అట్టు లాశీర్వచనంబులు వడసి మదనాభిరాముండు బిల్హణ
కవి చంద్రుని నాసనంబునఁ గూర్చుండఁబెట్టి కుశల ప్రశ్నల
నడిగి కులగోత్రనివాసాదికంబులఁ దెలిసికొని యనంతరంబు

క. జనవిభుఁ డట హర్షంబున
ఘనభూషణములును హారకనకాంబరముల్
ధనధాన్యదుకూలంబులు
మునుపుగ నిడి యనిపి మంత్రిపుంగవుఁజూడఁగ. ౨౦

మ. వలతేఁడాకృతిలో, సుకావ్యరచనాప్రాగల్భ్యయుక్తిఁ గుసుం
డల షడ్భాషలయందు మిక్కిలి ప్రవీణత్వంబు గన్పట్టెడిఁ
లలనల్ వీనినిగాంచి వ్రాలుదురు స్వప్రాణేశసంగంబులన్
జులుకన్ వీడి,కటాయెటుల్ సుతయొనర్చున్ సత్కళాభ్యాసమున్

గీ. ధరణితల కల్పవృక్షము సరస సుకవి
యతని లావణ్యమంజరి యవనిఁ గలుగు
నాయతాక్షుల హృదయంబు లనెడి భ్రమర
పంక్తులఁ దమంతనే వచ్చి వ్రాలఁజేయు. ౨౧

క. అని రాజేంద్రుఁడు పలుకఁగ
విని మంత్రి యనంతరంబు వినయాన్వితుఁడై
'జననాథ ? యెఱుఁగలయిన నీ
తనయకు సాహిత్యవిద్య తప్ప' దనంగన్. ౨౩

ఉ. ఈతఁడు కాక యెవ్వగుమనీషులు కావ్యరసజ్ఞులున్ మదీ
యాతతభూమి నా తెలిసినంతకు లేరిపుడేమి చేయుదున్
నీతివిమండ వీవు కడునేర్పున నొక్క యుపాయ మెద్దియేన్
బ్రీతినిబన్నుమీ యనుడు నెమ్మది నెంచి యమాత్యుఁ డిట్లనెన్.

వ. రాజేంద్ర! మనయామినీపూర్ణతిలకమ్మ పుట్టుగ్రుడ్డను గనుం
గొన నను వ్రతంబు పూనియున్నది గాదే యట్లును బిల్హ
ణుఁడు కుష్ఠరోగముఖంబు వీక్షింప నని పూనికతో నున్నట్లు
విందు మట్లగుటంజేసి. ౨౫

ఉ. కొమ్మను గుష్ఠరోగిణిఁగఁ గోవిదు నంధుఁగఁ జెప్పివారలన్
నమ్మఁగఁ జేసి మీకునయనంబుల నొండొరుఁ గాంచకుండ వ
స్త్రమ్మును మధ్యభాగమునఁ జాటుగ గట్టిద మట్టులైన నే
మమ్మది భంగమొంద దనుమంతటసాగును శాస్త్రపాఠముల్.

క. పిమ్మట ధరణీపాలకుఁ
డమ్మంత్రినుడుల నుతించి యట్లే సేయన్
నెమ్మనమున నెలమిందలఁచి
గ్రమ్మఱఁ బిలిపించెఁ బుత్రి రమ్యగుణాఢ్యన్. ౨౭

మదనుని మంత్రదేవత సమక్షముగాఁ జనుదెంచి నిల్చెఁ బో
యిదియనఁ దండ్రిసన్నిధిఁ బ్రతీక్షిత శాసనయై నిలన్ సుతన్
ముదమునఁ గాంచి యభ్యసనమున్ బొనరింపుము సర్వశాస్త్రముల్
సదయతఁ జెప్పనంధుఁడగు సత్కవి బిల్హణనాముఁ డెంతయున్.

వ. అను జనకుని వాక్యములు విని యామినీపూర్ణతిలక తన తండ్రితో నిట్లనియె- ౨౯

క. "జనకా! మీకిది న్యాయమె
కనుఁగొన జాత్యంధు ముఖము కలలో నైనన్
జనునే వ్రతమును జెఱుపన్
గనుమీ మఱియొక్క తెఱఁగు కారుణ్యమునన్." ౩౦

వ. అది యాలకించి మదనాభిరాముఁడు పుత్రికను దగ్గఱగఁ దీసికొని శిరంబు మూర్కొని చిబుకంబెత్తి వాత్సల్యంబు పొంగ నిట్లు కుమారితో ననియె- ౩౧

అటులైనన్ విను నీ వ్రతంబునకు గీడావంత రాకుండఁగన్
బటమున్ మధ్యగఁ గూర్తు నీ కతఁడు గానన్ రానియట్లంచు నె
ట్టటొ కూఁతున్ వడిఁబంపి; బిల్హణుని కీవృత్తాంతముం జెప్పుచున్
బటుశాస్త్రంబులు నేర్పఁగోరుటయుఁ దత్ప్రాజ్ఞుండు తానిట్లనెన్.

గీ. "నరవరాధిప! నీ చెప్పినదియె లెస్స
కాని కుష్ఠరోగ ముఖము గనను వ్రతము"
అనఁగ నిట్లను రాజు "మహాత్మ! వ్రతము
చెఱుప నాకిష్టమే! మధ్యఁ దెరను గూర్తు." 33

క. కటకట! యేమి యొనర్చెద
నిటులన్ నిర్బంధపఱుప నృపతిన దేశ్యా!
యటులే కాక మ్మోములో
చటులమ నానేర్పుఁగొలది చదివింతు సుతన్. ౩౫

అను కవివాక్యముల్ విని గృహంబునకున్ గవిఁబంపి, మంత్రితో
జనపతి నీతికోవిద! యసాధ్యములే యెవినైన మీకు, మీ
విరచినటుల్ పొసంగ"నని వెంటనె మూకుత ముంచి యొక్క గీ
ము నపుడలంకరించి యటఁబొందికఁ గట్టఁగఁజేసె వస్త్రమున్.

వ. అంత నొక్కశుభదినంబున విబుధులు నమాత్యులును దో
నరుదేర నా గృహంబున ప్రవేశించి పుత్రిని బిల్హణుని
రావించెను. అంత బిల్హణుఁడు సత్కృతుండై సరస్వతీదేవి
పూజ గావించి యా రాజకుమారిచేత రామాయణంబు
మొదలు పెట్టించె- ౩౬

తే. పిదప మదనాభిరామ పృథ్వీధవుండు
కనకవాహన వస్త్రముల్ కరమువారి
వారి కుచిత మారీతిని బసదనముగ
నిచ్చి స్వగృహంబులకుఁ బంపె నెల్లబుధుల. ౩౭

క. సుతకున్ బిల్హణకవికిన్
సతతము తాంబూల వస్త్రశయనాసన సం
హతుల వరభోజ్యములనిడి
ప్రతిదినమును విద్యనేర్పఁ బనుపొనరించెన్. ౩౮

ఆ. అద్ది మొదలు గాఁగ నవనిపాలుసుతకు
సర్వశాస్త్రములును సర్వకళలు
నియమరీతి యొప్ప నేర్పఁగా మొదలిడె
విబుధసత్తముండు బిల్హణుండు. ౩౯

సీ. వివిధ ధ్వనివిశేష నవరసాంచిత మైన
సరసగుణాలంకార శాస్త్రమందుఁ
గవిభావ సంరంభ గంభీర మైనట్టి
యధిక మనోజ్ఞ కావ్యముల యందుఁ
బాత్రౌచితీ ధీరనేతృ భూషితమైన
యమలినోచిత నాటకములయందు
బహుబంధ బంధుర బహుసుఖవిషయమౌ
సకల కామద కామశాస్త్రమందు

తే. సజ్జనాదృత నానార్థ శాస్త్రమందుఁ
బూత మైన ఛందోంబుధిపూరమందు
నధికమతియుత పూత రాజాత్మజాత
బిల్హణునికన్నఁ గూడను బెద్దయయ్యె. ౪౦

ఇది ప్రథమ తరంగము



# బిల్హణవిలాసము

## (ద్వితీయతరంగము)

మత్త. అంతమాఱునర్కుఁ సహాయము నాచరింపఁగ దిఙ్ముఖం
బెంతొ శారదపూర్ణిమన్ వికసింపఁజేసి యొకప్డు తా
రాంతరంగ విహారియైన శశాంకుఁడింపుగఁ బ్రాగ్దిశా
ప్రాంతమందు వెలుంగువాఁడయి యప్పుడే యుదయించెడిన్.

ఆ. సోమబింబ మలరె యామినీ కామినీ
శ్రోత్రభూష దంత పత్ర మనఁగఁ
బుష్పధన్వి తనదు పుష్పబాణంబులు
పదనుపెట్టు సానపలక యనఁగ. ౧

ఉ. క్రందగు చీఁకటుల్ దఱిమి కైరవకోరకముల్ విదల్చి, శ్రీ
నందనుచిత్తమాంద్యము నణంచి వియోగులబాధపెట్టుచున్
ఇందదిరా! పురందర దిగిందర సుందర కర్ణకుండలం
బైందవమండలం బుదయమందిర మందుఁ బరాక్రమించెడిన్.

తమమున్ దోలుచుజ్యోత్స్నఁజల్లుచుదిశల్ ధావళ్యమొందించుచున్
కుముదంబుల్ విదళింపు చబ్జముల సంకోచింపుచున్ గోక హ
ర్షముమాయింపుచువార్ధినింపుచుయువస్వాంతంబులాడించుచున్
రమణీమానముఁబ్రీఁక్చుచున్ హిమకరుండంతన్ విజృంభించెడిన్.

శయనగృహంబునందుఁ దన శయ్యఁబయుండి గవాక్ష సన్నిధిన్
నయన విలోభకుండయి యనంతఁగలట్టి వియోగరాజి క
ద్రియముగఁగాను తాపమును బెల్లుగఁ జేయుచున్న గాంచఁ జూచుచున్
రయమున నిట్లు వర్ణనమొనర్చెఁ గవీశుఁడు హృద్వ్యపద్ధతిన్.

హిమకర ! నీదుమధ్యమున నింపుగనుండు కళంకమున్ వట
ద్రుమమనికొందఱందు; రొకరుల్ శశమంద్రు; మరొక్కరుల్ కురం
గమని వచింత్రు; కాని విధి కాంతలయొష్ఠము చేయునప్డు నీ
యమృతముతీయనోపు నపుడందులఁ గుక్షి నిరంధ్రమయ్యెఁబో.

తే. ఆకసం బిది యనఁ దగ దబ్ధికాని
తార లివికావు ఫేనభిత్తములుగాని
శశియుఁగాఁడు కుండలితశేషాహి కాని
యంక మిది గాదు శయితమురారి కాని. ౭

చ. ఒకరు కళంక మంచు నిఁకనొక్కరు వార్నిధిపంకమంచు వే
ఱొకరుకురంగమంచుమఱియొక్కరు మేదినిచాయయంచునా
శకలితశక్రనీలమణి చాడ్పునఁ గన్పడుదాని నంద్రు నే
నిఁకను దలంతురాత్రి కబళించినచీఁకటియంచు నెమ్మదిన్.

ఉ. తూరుపురక్తిమన్ గనఁగఁ దోయధి పొంగ వియోగిభీతిలన్,
గైరవముల్లసిల్ల నళినంబులు వాడఁ, దపింపఁజక్కవల్
పాఱెదమంబు, లాకసముప్రస్ఫుటమై వెలుఁగన్, జకోరముల్
ధీరత నుండమారుఁడు మదింపఁ గురంగియొసంగెరంగులన్.

మత్త. ఇందుబింబసురంగమార్గము నెల్ల దాఁటుచు వచ్చి భూ
మందిరంబునఁ బైకి లేచి సుమాస్త్రచోరకుఁ డత్తఱిన్
సుందరాంగుల మానవిత్తము చూఱఁగొంటకునై యిటుల్
ముందు చల్లిన మోహభస్మముపో యనందగె వెన్నెలల్.

తే. శారద మనోహరాకాశ శాణమందుఁ
దీసి రాశి చేసినగంధ మీశశాంకుఁ
డందుఁ దావికిఁగాఁ జేర్చినట్టి కమ్మ
కస్తురిరజంబె యీకళంకం బయారె! ౧౧

తే. విమల మహాపూర్ణిమాచంద్రబింబ మదిగొ
నద్ది యాకాశవాపిలో నంబుజమ్ము
స్మరుని శరములఁ బద నుంచు సానపలక
సుందరమగు సంధ్యేందిరా కందుకంబు. ౧౨

క. అని కవి యిటు వర్ణింపఁగ
విని ధరణీపాల తనయ విస్మయ మొప్పన్
మనమున నిటు లూహించెను
గనివిని యెఱుఁగ మిటువంటి కౌతుకమనుచున్. ౧౩

క. అంధుం డెక్కడఁ గుముదిని
బంధుం డెక్కడఁ దదీయవర్ణనరచనా
బంధం బెక్కడ నిది సం
బంధించునె యిట్టివింత క్ష్మాతలిఁ గలదే. ౧౪

ఉ. అంధుఁడు గాఁడు బిల్హణుఁ డిదంతయు మజ్జనకచ్ఛలం బెట్టై
నం ధరియింతుఁగాక వ్రతనాశము, తప్పక యీ మహాశయున్
గంధరయెత్తి చూతునని కాండపటోపరినుండి రత్నజా
లంధరమందు రాజిలు కలానిధిఁ జూచెను మోహవశ్యయై.

తే. యామినీ పూర్ణతిలక యనంతరంబు
సుమశరాకారు బిల్హణుఁ జూచి యపుడె
పంచశరశరతాడితస్వాంత యగుచు
బొంది విడి కవిఁ జేరె నా మూర్ఛనొందె. ౧౬

క. అప్పుడు సుకవివరేణ్యుఁడు
మెప్పుగఁ బూర్వాచలంబు మీఁదటి దివిఁన్
అప్పుడె వచ్చిన చంద్రుఁ
దప్పక నిరసించు మోము దాఁగని తలఁచెన్. ౧౭

"ద్విజపతిబింబమో ముకురబింబమొ పద్మమొ యాననమ్మొ; నీ
రజములొ గండుమీలొ మకరధ్వజుతూపులొ వాఁడిచూపులో
ద్విజములొ పుష్పగుచ్ఛములొ తేలెడుబంగరుగిండ్లొ గుబ్బలో
వ్రజననతారయో మెఱుపొ బంగరుతీవయొ కోమలాంగియో.

హరిణము లేని శారద మృగాంకుని బింబముకాని మోము కా
దరయ సుధాప్రపూర్ణమగు స్వర్ణపుఁ గుండలుగాని యివ్వి కా
వురసిజముల్; సుమాయుధ శరోత్కర శాలలె కాని కావు ముం
గురులు; విటాళిఁ గట్టఁగల గొల్సులె కాకివి కావు క్రీఁగనుల్.

భయదధ్వాంతము చంద్రఖండము ధనుర్ద్వంద్వంబు నిందీవర
ద్వయముల్ గోకనదచ్ఛదంబు విలసచ్ఛంఖంబు తీవల్ సుకుం
భయుగం,బభ్రము, సైకతంబు సృదురంభల్ కాహళుల్ పద్మముల్
స్వయమేచేసి మరున్మరీన్ మనుపు లీలాహృద్యభావంబులన్.

ఉ. నాదుమనంబు కాంతకఠిన స్తనమధ్యముఁబొంది క్రమ్మఱన్
రాదు నశించెనో చనులరాపిడినల్ల; వియోగవహ్నిలో
బూదిగ నయ్యెనో సతిమనోజ్ఞసుధాసరసిన్ మునింగెనో
యూఁదినయౌవనాటవిని నుండు మరుండును దొంగిలించెనో.

వరగాత్రీముఖలక్ష్మిఁ గాంచి శశిబింబంబందుఁ గూర్చుండుతన్
మరులన్ గొల్పుచపాంగవార్త వినినంతన్ గల్వలేమూనోకో
పరువెత్తన్వలె వీణెనాదమయినన్ బద్మాక్షి మాటాడినన్
చిరుమధ్యంపు యశంబుసోక దివికిన్ జేయెత్తుచే దిక్కుఁగన్.

క. ఇటు వర్ణించెడు రసికుని
చటుతర వాక్యామృతంబు శ్రావ్యముగ శ్రవః
పుటములఁ గ్రోలుచుఁ దేటియు
నటుఁ గవి వదనేందుఁ గాంచి యాత్మఁ దలంచెన్. ౨౩

క. "చులకన యైన మనంబున
నలువుగ బిల్హణునిఁబొంద నాయంతటనే
వెలువడ గ్రహించునొ గ్రహిం
పఁడొ తెలియుట యెట్లు వానిమానసవృత్తిన్." ౨౪

అని తలపోసి నెమ్మనమునందు ధరాధిపుఁబుత్రి వానినుం
డి నయనముల్ తటాల్న మరలించియు విహ్వలగాత్రియై పటం
బునుదొలఁగించి పానుపునఁ బొర్లుచు మిక్కిలి మన్మథార్త సం
హననయయ్యెచు 'నోయిచతురాననప్రోఫు' మటంచుఁబల్కఁగన్

వ. అప్పుడు బిల్హణుం డిట్లనియె ౨౬

'కువలయనేత్ర! త్వన్మధుర క్రూరకటాక్ష నిరీక్షణాస్త్రముల్
తవిలి వ్రణంబుగల్గెఁగట! దానిని మాన్పఁగ రెండెయౌషధుల్
భవదధరోష్ఠనిష్ఠ మధురామృతపాన మొకండు, తన్వి! రెం
డవది త్వదీయతుంగకఠిన స్తనకుంకుమ పంకలేపముల్. ౨౭

క. అనవుడు నాతని భావము
గనుఁగొని సంతోషభరము కౌతుకభరముల్
బెనఁగొనఁగ లేచి యట నెం
టనె యుడె బిల్హణునికిన్ దృఢాలింగనముల్. ౨౮

చ. నడుమనె యున్నవల్ల నవుననుచునో విప్పకమున్నె నీవి తా
విడినడిజాఱెఁ; గంచుకము విప్పఁగలేదుగదా యదేవడిన్
విడిప్రిదిలెన్; ద్రపల్ముఖము నెత్తదుగాని ముఖంబెగాంచెన
య్యెడనవురౌర! సిగ్గుఫలియించునె తాదృశభావరక్తిమల్.

ఆనందాంబుధిమున్గెనో ప్రియ యపాంగాలోకముల్ పేరిశోఁ;
దానర్మోక్తినెపానఁ జొచ్చెనొకో శ్రోత్రద్వారదేశంబునన్;
పీనాశ్లేషమిషన్ స్మరఘ్నుయయి యావేశించెనో చిత్తమున్;
మానంబుల్ విడి ప్రేమతోడఁగనెనో మైమర్చి యేకత్వముల్.

గాజులు(మ్రోయఁగా, సకలగాత్రము మిక్కిలి మోద మొందఁగన్
నైజరతిన్ గగుర్పొదవ, నమ్రముఖులై యురమందు స్ఫారవ
క్షోజములున్ మునుంగఁగఁ బ్రసూనశరాసన తంత్రముల్ దగన్
భ్రాజిలు స్త్రీభుజావలయబంధ మమందముదంబు నీయుతన్.

స్మరు శరముల్ ఘనుండు విరఁజల్లె; నభంబు చలించె; రోహిణీ
సరసుఁడు తాల్చె ముత్తెములచాలు, సితోత్పలయుగ్మమున్ గనెన్
నరళత; మేల్ కపోతమణితాభినయం బొనరించె శంఖమున్;
ఉరవుగఁదిర్గెఁ గోకయుగ మోచెల! పద్మజు సృష్టియెట్టిదో.

పూరితచంద్రికల్ దెగడు ముత్తియముల్ శశి కెంతయో యలం
కారముగూర్ప, మీనుల వికాసము క్రమ్మఱి తగ్గిపోవఁగన్
గాఱుగుచీఁకటుల్ విమలకంజముమీఁదను నాట్యమాడఁగన్
మారుని వైరి కేశములమధ్యను గోయి శ్రమన్ హరించెడిన్. ౩౩

క. హరిణాంకుఁడు మౌక్తికముల
ధరించె; శంఖమునుండి ధ్వనియెదో వెడలెన్
గిరియుగ్మము దివిపై గిర
గిర దిరిగెను నిట్టివింత క్షితిపైఁగలదే. ౩౪

లలితతటిల్లత లాస్య మొనర్పన్
దళముగ నీరు సుధానిధి చిల్కన్
జలదము పూవులఁ జల్లుచు నుండన్
లలితసరంబుల రాల్చె దివంబున్. ౩౫

సీ. నవపూర్ణాస్తనంబునఁ బ్రవిమల గాత్రియై
యసితనీలత నుల్లసన మొంది
శారదసననీల శశధరచంద్రికా
ప్రస్ఫార పాండరాంబరము దాల్చి
కడు దీర్ఘ మైనట్టి కబరీభరంబును
గరపల్లవంబునఁ గదియఁ బట్టి
శృంగారపీయూష తుంగపాథోధి త
రంగ రమ్యజలాంతరమున వెలసి

తే. రమణి వేఱొక్క పంకజాలయ జనించె
ననఁగ నొప్పెను రాకా శశాంకవదన
యమల శృంగారయోని విహారభూమి
స్వర్ణమయలత యామినీపూర్ణతిలక. ౩౬

వ. ఇట్లుండ నొక్కనాఁడు ౩౭

ఉ. దంపతు లిద్దఱుం శయనతల్పమునం బొలయల్కఁ బొందియా
పెంపున మోముఁదమ్ము లటు లెట్టి పరుండియుఁ దాళలేరు సం
ధింపఁగ దూతియైనఁ గనిపింపదు; శయ్యయుఁగొంచెమైన గం
పింపద కప్పుడుప్పు లిటు యదృష్టవశంబునఁ గూర్చె స్నేహముం.

వ. పిదప బిల్హణకవిగ్రామణి యొకనాఁటి రాజుపై మిషపెట్టి మద
నుని సవ్యార్థంబున వినుతించె— ౩౮

శా. ఓయీ శ్రీమదనాభిరామనృపతీ! యోషిత్సభాగ్రంబునన్
నీ యాకీర్తిలతాంగి దాఁటు మకరానీకోగ్రవారాంనిధిన్
ఆయాకాశముఁ జేరు; భూమిధరమూర్ధారోహముల్ జేసెడిన్
దాయాసం బొనరించు సర్వగృహపాతాళంబుకై యొంటిగన్.

వ. మఱియు నొక్క సమయంబునఁ బ్రణయ కలహంబునఁ దన్ను వీడి యరిగిన ప్రాణేశ్వరిని గనుంగొని నేత్రభుషంబున నిట్లనియె. ౮౧

కలఁగితి వంచు సుభ్రువ! యిఁకన్ రుచియింపదు తిండి; వీడితిన్
లలనలసంగతిన్; బరిమళంబులు గిట్టవు; వీడు మోసియీ
యలుకను రాగిణీ! యివె జోహారులు; త్వద్విరహంబువల్ల ది
క్కులు సకలంబు గ్రుడ్డినగుఁ గోమలి! నన్ను ననుగ్రహింపవే.

వ. ఇత్తెఱంగున నానందడోలికలలోఁ దేలియాడు నయ్యవసరంబునఁ జేటికాముఖంబున నీ వృత్తాంత మంతయుఁ దెలిసికొని నృపతి. తన పుత్రికను రావించి కోపోగ్రుఁడై యిట్లనియె—

సుగుణుల రాజపుత్రులను జుట్టములన్ బిలిపించి యింటిలో
సొగసగు మూహుతం బునిచి సుందరగాత్రు స్వయంవరంబునన్
దగునటు పెండ్లిచేసి కడుధన్యుఁడ నౌదునటంచు నెంచి యుం
డఁగఁ గులమున్ గళంకిత మొనర్పఁగ యుక్తమె. యేమిచేయుదున్

జనకుఁ డిటుల్ వచింప నెత జంకును లేకవచించెనిట్లు 'నా
యన ! యిది నీవుచేసినదె, యద్దివెపంబుగ నీకు మాత్రమే
మనమునఁ గష్టమాయె, శుభమాయెను నాకది; నీవు మధ్యయం
దును దెరగట్ట మాకపుడె తూర్ణమె యయ్యెఁ గర గ్రహంబిలన్.

చ. నరపతి పుత్త్రిపల్కు విని నాదు కుమారి పటంచు నేఁటికిఁ
గరుణ నినున్ క్షమింతు: మతిగల్గి మనంబున నిప్పుడైన దు
శ్చరితుని బిల్హణున్ విడచి సద్గుణవై విలసిల్లుపుత్త్రి ! భూ
వరతనుజన్ము సత్కులు వివాహ మొనర్చెద నీకు నిప్పుడే.

వ. అని జనకుండు పలుకువాక్యములువిని దేవా! యుపధరింపుము
ఇంతకుఁ బూర్వమే మదీయంబులగు చిత్తనేత్ర జిహ్వాఘ్రాణ
శ్రుతి స్పర్శేంద్రియంబులు అతనియధీనంబు లయి వర్తిల్లె.
పరులకు సమర్పింపఁబడి చైతన్య శూన్యం బైనయీ పట్టి శరీ
రంబు నెవ్వారి కిచ్చెదవు. ఇది భావ్యమే. ఇది మిము బోఁటి
వార లాచరించెదనదియే. అని యామినీపూర్ణతిలక విన్న
వింప వాసం బెడచెవింబెట్టి భూధవుం డతి క్రోధంబున నట
నుండి దిగ్గున లేచి సభకుం బోయి కోటిపాలుఁ డనుపేరుగల
కొత్వాలుతో "సత్వరంబుగ బిల్హణకవిని బట్టి శిరచ్ఛేదంబు
గావింపుము పొమ్ముపొ"మ్మని యానతీయ నా కోటిపాలుండు–

క. కోపంబుచేత నెవ్వఁడు
పాపుల దండించి సుగుణవంతుల నెలమిన్
వే పరిపాలించు నతఁడె
క్ష్మాపాలుం డగు; నితరుఁడు క్ష్మాపాలుండే. ౭౮

చ. క్షితివర! యట్లు మీపనుపు చేయుదుఁగాని భవన్మనంబునం
దతినిపుణంబుగాఁగ నుచితానుచితంబుల నెంచి క్రమ్మఱన్
మతికిని దోఁచులాగున నొనర్పుమటన్న నృపుండు దానినిన్
శ్రుతి పథమందుఁ జేర్పమికి శోకముతో విధిలేక యేఁ చనెన్.

ఇది ద్వితీయ తరంగము



# బిల్హణవిలాసము

(తృతీయతరంగము)

వ. అంతఁ జెలికత్తెలవలనఁ దన ప్రియుని వృత్తాంతము దెలిసికొని మూర్ఛిల్లి రాజపుత్త్రి కొంతవడికిఁ దేఱి నయనాంచలంబులనుండి కన్నీరు వఱఁదవాఱ భూతావిష్టయుఁ బోలె బయుంగిడి వచ్చి రాజమార్గంబున కెదురుచూచుచు ద్వారంబున నిలిచియున్న ప్రణయాధిదేవతను గనుఁగొని బిల్హణుఁ డిట్లనియె- ౧

చ. తలపయికెత్తి సంతతము ద్వారమునన్ నిలుచుండి బాలరో తెలితొవతేకులం బెగడు తెల్లనికన్నుల నేలచూచెదో తెలియనిదాన! దేవయువతీ సవిలాస కటాక్షవాగురా వలయమునన్ దగుల్కొనిన పండితబిల్హణుఁ డింక నచ్చునే.

వ. మనోహారీ! యశ్రుకణికాపాతంబున నధరోష్ఠదళంబు చిల్లులువాఱ నేలయేడ్చెదు. ఈయవసాన సమయంబున నొక్కపరి భవదీయ మందహాస జ్యోత్స్నలఁ బ్రసరింపఁజేసి మదీయ దుఃఖాంధకారంబు తొలఁగింప వేఁడెద. చైతన్యశూన్య మగు పద్మిని యస్తమించు తనప్రియుండగు తపను ననుసరించుఁ గాక. సచేతన వగు నీ విట్లు చింతింపఁ జెల్లునె. జీవితంబులు శాశ్వతంబులె. మరణ మెవ్వారికి నలంఘ్యముగదా.

ప్రణయపణమున సంభవించిన యీ మృత్యువు ఆనందకరం
బగుట యెఱుంగవె. 3

చ. అనుచు శ్మశానభూమి దరి కత్తఱినేగి శిలోపవిష్టుఁడై
మునుపుగనల్లిశిల్ గనుచు మోమునహాసము మొల్కలెత్తనా
జనపతి పూరుషుల్ బలికె శస్త్రముచేత మదీయ మూర్ధ క
ర్తన మొనరింపు భద్రుఁడ! నిరంతరసౌఖ్యము నీకుఁ గల్గెడున్

వ. అనుటయు నప్పూరుషుండు— ౪

చ. "కవివర! యిప్డు నవ్వుటకుఁ గారణమెయ్యది భీతిలేదె నన్
జనమునఁ జంపుమాచనెదు' నాఁగవిపల్కె 'మదీయదేహమం
దవిరళమై ప్రఫుల్లనయనాంచిత వక్త్రసరోజ దేవి తాఁ
గవిసియె యుండ భీతి కవకాశము గల్గునె యెట్లుమాచినన్."

వ. అని వచించి మఱియు బిల్హణకవిచంద్రుఁడు తనప్రియురాలి
వృత్తము స్మరించి యిట్లు భావింపఁదొడఁగె — ౬

చ. స్మరునివిలాసలన్ బఱపుచారుతరం బగుతళ్కులొల్క, భా
స్వరముగఁ జెక్కుటద్దములఁ బత్రలతల్ చెలువార మీఱు పీ
వర కఠిన స్తనాంతర విభాసిత మౌక్తికహార శోభితన్
వరగుణ నామభాగ్యములపంటను సంతతమున్ స్మరించెదన్.

చ. కనకపునిగ్గు సంపెఁగ నిగన్నిగలన్ నిరసించు మేనునన్
తనునగునాననన్ వికసితాక్షిసరోజములన్ బసండి మే
ల్కొన రతివిహ్వలాలసములై చనునంగములన్ జెలంగు నా
తనులత నిప్డు మాంద్యగళితం బగువిద్యనటుల్ స్మరించెదన్.

విదళిత పంకజాంతర నివిష్టరుచుల్ మెయిఁ దాండవింపఁగన్
సదమలరోచనాతిలకసంగతరాగ మెలర్ప ఫాలమున్
మదజడ ఘూర్ణమాన నయనాంచలరోచులఁ జిమ్మ మత్ప్రియా
వదనము నాదుమానసిక పట్టమునన్ లిఖియించిగాంచెదన్. ౧౦

ఉ. జాళువకమ్మలాలు పురుషాయితకేళిని జెక్కులొత్త నాం
దోళనజశ్రమాంబువులు శోరముల్లై ధవళాంబులౌచు ము
త్యాలసరాలఁబోలి హృదయంగమమైకనుపట్ట నొప్పునా
యాలలితాంగి యాననము నాత్మఁ దలంచెద సావధానతన్.

ఉ. పూర్ణసుధాకరాననను ఫుల్లవినూతన యౌవనాంగినిన్
శీర్ణితకంచుకస్తనిని నీరదకేశిని గౌరరోచి రు
చీర్ణ శుభాంగిఁ బంచశరతీవ్రశరానల దగ్ధగాత్ర ను
ద్దీర్ణ సుధారసంబుఁ బ్రియుఁ దేఁకునఁగాంతు నిమేషశూన్యతన్

ఉ. నే నెఱనెంచి తమ్మి నిశినెమ్మి రాజతనూజ తాఁ 'జిరం
జీవ' యటంచు మానజపుసిగ్గున మంగళవాక్కు పల్కెలే
కానలపెట్టిదో యెఱుఁగ నమ్మకచెల్ల! పసిండికమ్మనే
మేవడి నా చెవిన్ జొనిపె మేలది నామది పీడకుండెడిన్.

చ. మణిల లభించెనేనియుఁ బ్రమాదము లేక సరోజనేత్రఁ బీ
వర కఠినోన్నతోరసిజ భారవిశేష వినమ్రగాత్రినిన్
గరయుగ పాశబంధమున గాఢముగా బిగియించి మత్తబం
భరము సరోజముం బలెను వక్త్రము గ్రోలెద నేయథేచ్ఛగన్

కుటిలములున్ వినీలములు కోమలముల్ నునుసోగముంగురుల్
స్ఫుటితములున్ విశాలములు ముగ్ధములున్ దెలికన్నుదామరల్
పటుతరముల్ విపీనములు బాపురె! యుబ్బినగబ్బిగుబ్బలున్
దిటముగఁ బ్రౌఢిచూపఁ దగు నెచ్చెలి నెంతు గురూక్తవిద్యగన్.

కుందపుమొగ్గలం దెగడుకోమలదంతపుఁగాంతు లొప్పఁబ్ర
క్కందగి వక్రచంచలదృగంచలరోచులు చెన్నుమీఱ నే
మందుము బలే! లతాంగి మొగ మందము; సాధుకృతోపకార మా
నందముతోఁ గృతజ్ఞుఁడటు నామది భావనచేతు నెప్పుడున్.

అంగజుకార్ముకాగ్రమున నందముగా విలసిల్లి నట్టియా
భృంగవిరాజి నీలరుచి నెంతయుఁ గుంతలముల్ పిశంగమై
రంగుగ నుండఁగా శ్రవణలగ్నసితోజ్జ్వలదంతపత్రముల్
కంగవ సార్థకంపఱుపఁ గ్రాలు మొగంబు దలంతు మాటికిన్.

గళమును వెన్కవైపునకుఁ గాఁగఁ డటాలునఁ ద్రిప్పి వహ్వారే!
కులికెడి పెన్పిఱుందపయిఁ గోమలపాణిసరోజ ముంచి యు
గ్గలమగు కేశపాశము రకంబుగ దాపలిప్రక్క వ్రేలఁగన్
జిలుకలకొల్కి క్రీఁగనులఁ జిమ్మినయప్పటిసొంపు గాంచెదన్.

సరళము మంజులం బయినచక్కనియెత్తగునాసికంబుచే
విరిసిన పంకజంబుల వెగ్గలికన్గవచే, స్ఫుటంబు సుం
దరమును మాంసలంబును సితంబగు చెక్కులస్నిగ్ధకాంతిచే
వఱలుశరత్సుధాంశునిభవక్త్రము కన్నులఁ గట్టునిప్పుడున్.

కూటమిలోన నొక్కపుడు కొండొకదోసము సేసి వేడుచున్
మాటికిఁ గాళ్ళపైఁ బడిన మానక గెంటుచు నాదు చేతిలోఁ
బైఁట చెఱంగు లాగికొని వద్దుర వద్దనుమా యటంచుఁ గేల్
మాటలు గిన్కఁ బల్కుచుఁ గలహ్వాని సేడ్చి విముగ్ధ నెంచెదన్.

పిఱుఁదుల వ్రేఁగునన్ జనుల వ్రేఁగున మధ్యగ నున్న లేత కౌ
నఱునొకొయన్ భయంబున నొనాఁదగు మంద్రవిలాసయానమున్
సరసులకైనఁ గాని గనఁజాలని పొక్కిలిలోతు; నూత్నసుం
దరబిసకోమలంబు లగుతక్కరముల్ మదిఁ బాయవిప్పుడున్.

అలరి యనంగసంగరవిహారవిరామమునన్ మనోజ్ఞదృ
ష్టు లధికపారవశ్యమునఁ జొక్కుచు సోలఁగ, సౌరతశ్రమన్
గలిగినయూర్పు లచ్ఛతమఘర్మకణంబులఁ జిమ్మ వేయు స్ని
గ్ధలలిత కాంతు లీనువనితామణిముద్దుమొగంబు నెన్నెదన్.

ఉ. ఇంచినవేడ్క నొక్కయెపు డెగ్గొనరించిననన్నుఁ గాంచి కో
పించియు వంతఁ బైకుబికె వెల్వడునశ్రులఁ గంఠమందు స్తం
భించియు నీళ్ళు గ్రుక్కుకొను చేమివచింపఁగలేక యూర్పులన్
మించెడిమోవి చెన్ దఱుగ నేడ్చెడి ప్రేమమయిన్ భజించెదన్.

తటుకున నొక్కమార్ పృథునితంబముకూలము లాగివైచియ
ప్పటిబలుసొంపుచూతుఁగద బాపురె! యొక్కకరాంబుజంబుచేఁ
జటుకున గుహ్యభాగము కనంబడకుండఁగఁ గప్పి మేల్ మఱొ
క్కటిదగు కేలఁ బొక్కిలిని గప్పెఁగదా యది వ్రాసి గాంచెదన్.

హారాంతరికత్తై నేత్రములనోరగవైచి హాయాయల్ గనంగ నే
కాంతమునందు దర్పణము గైకొని చూచుచునప్పు నెన్కగా
వింతగ నిల్చునాదు ప్రతిబింబము గాంచి వణంకు సంభ్రమం
బెంతయు సిగ్గుగల్గఁ బ్రణయేచ్ఛను మించెను దాని నెంచెదన్.

సురభిళఫుల్లగండయుగశోభితవక్త్రసరోజ మానఁగన్
బిరబిర వచ్చిపైఁబడెడిబిత్తరితుమ్మెదఁ గాంచి నేత్రముల్
బెఱచుచు మూయుచున్ బెదరి తేఁకువఁ గేళిసరోరుహాంబుచేఁ
బారిఁబారిదోలుచున్ గుదుటబొందుమృగేక్షణ జూచిచూచెదన్.

వంచనచేసి ప్రేమ యెటువంటిదొ గన్గొన దాగియుండఁ ది
ర్యంచితలోచనాబ్జయయి ప్రస్ఫుటహైమసరోజమున్ బిసా
ళించు మొగంబు ద్రిప్పి యటులిట్టులు లోఁబయిముందు వెన్కలన్
బొంచియుఁ బొంచినన్నుఁగనఁ బోవుచుఁ దిగ్గప్రియన్ భజించెదన్.

సరసిహాయాయల్ గనం దలుపుచాటున దాగ, క్షణంబుగూడ వి
ద్విరహము సైఁప లేక నలుదిక్కులుగాంచుచుఁ గుంది యాస్యమున్
గరముపయిన్ ఘటించి మదిఁ గాంక్షలు పైకొన నాదునామమున్
వరమృదుగీతులన్ గలిపి పాడెడి ప్రేయసి నెంచకుందునే.

ఎవరయినన్ గనుంగొనెద రేమొకొ నా శ్రవణాంతభాగయో
గ్యవిలసితంబులై యొదిగి కౌటిలవృత్తిఁ జరించుచున్ సుమా
స్త్రవిహతి నుండి ప్రోచుచు విలాసచలచ్చకితంబులౌ కటా
క్షవిలసనద్యుతుల్ మెదలు చాడుచు నున్నవి లోన నేటికిన్.

గమగమతావి పర్వఁగ సుగంధము, కాంతములైన చెక్కుట
ద్దములకలంది పైమృగమదంబున మిక్కిలి మోహనంబుగా
గ, మకరికాది పత్త్రలతికల్ రచియింపఁజెలంగు నట్టి భీ
తమృగ విలోచనాస్యము మదంతర దర్పణమందుఁ గాంచెదన్.

చ. బలిమి నురోజకేశములఁ బట్టినపట్టున దంతపంక్తిచేఁ
జలదధరోష్ఠపల్లవము చట్టన మెల్లన నొక్కఁగాఁ దమిన్
బులకితయై ముదంబునఁ గనుంగవ మోడిచి పారవశ్యముం
గలిగి చెలంగు సీత్కరణ గర్భముఖాబ్జము విస్మరింతునే.

కిసలయమందు మల్లియలు కెంపున ముత్యము లుండుచాడ్పునన్
ముసిముసినవ్వువెన్నెలలు మోవిపయిం దళుకొత్త మేల్సుధా
రసమధురంబులై మృదుతరంబయి మారవిహారకేళికా
రసహృదయంగమంబయి పరంగెడి జిబ్బిలిపల్కు లెంచెదన్.

కాంచనపత్త్రముల్ చెవులఁ గ్రాల, సరంబులు సిల్వ దేశముం
గాంచక యాక్రమించిన స్తనంబులపైఁ బడిత్రొక్కఁ దోడురా
నెంచు నితంబము న్నదిమి నేమన మేఖలయొప్పు ఘల్లుఘు
ల్లంచును నందియల్ గదల నాడుమదద్విపయాన నెన్నెదన్.

లలిత మృణాలకోమలకరవ్రతతుల్ పెనవైచి కౌఁగిటం
గళమును నిల్పి యుబ్బెడి స్తనంబుల నాయురమందుఁ గప్పి య
గ్గలమగు పారవశ్యమునఁ గ్రన్నన మీలితలోలలోచనాం
చలయయి యోష్ఠపల్లవరసంబులఁ గ్రోలులతాంగి నెన్నెదం.

ఉ. ఔర! స్ఫురించుచున్నవవె హారివినత్రితకంధరంబు ల
జ్జారె! వికర్కశోన్నత కుచత్రుటితోజ్జ్వలహార పంక్తు ల
య్యారె! మృణాలకోమల భుజాగ్రసుసంగత కుంతలంబు లా
హా! రమణీయ వక్రనయనాంచల వీక్షణముల్ మనంబునన్.

బలిమినొడల్ విదిర్చికొను పట్టుల 'హూ' యని యూవలించుచున్
లలితమృణాల కోమలకరాంగుళిముల్ పెనవైచి దోర్లతా
వలయము పైకిఁజిమ్మి వహవా! పరివేషసుధాంశు బింబమున్
నిలువునఁ ద్రోసిరా జనెడు నెమ్మొగ మెట్టులఁ జూడకుండెదన్.

మడియడ నోట నెంతఁబ్రతిమాలినఁగాని దయార్ద్రిగాకయుం
బెడమొగమై పరుండి యటుమీఁదట తాళఁగలేక నిద్దురన్
బడలినయట్లు నా మొగము ప్రక్కకు మోమిడి దానిప్రేమ యె
క్కడబళి! వేఁకువన్ మెయిని గాల్ చెయి వైచెను దాని నెంచనే.

చిఱునగ వాననంబు పయిఁజిందులు ద్రొక్కఁగ జాఱినట్టి ముం
గురు లిరుచెక్కుటద్దములకున్ ద్యుతిగూర్పఁగఁ బైరతంబునన్
గర మగుపింప స్వేరుచలనశ్రమజాంబులు, మేల్ వగర్చుచున్
బొరిఁబొరి నేదొ గుప్తముగ ముద్దుగఁబల్కెడి శ్యామఁ గొల్చెదన్

ఎంతకు రాక నే నిలువ నెంతయు మన్మథపీడితాంగినై
యంతట శయ్యఁజేరి యిటులట్టులు దొర్లుచు నుండియప్పుడున్
జెంతకు రామిద్వారమునఁ జేరి యొకట్టొ ముడింగి నెచ్చెలిన్
జింతఁగవుంగలించికొని సీత్కృతినేడ్చిన కాంత నెంచెదన్.

అడుగులు తొట్రిలన్ మిగుల నాత్రమ వేళకు రాకవచ్చునన్
గడువడి ద్వారమందె గని క్రన్నన శయ్యనుబండి నిద్రఁబో
యెడిగతి నుండఁబోయి స్పృశియింపఁగఁ గంచుకితాంగయష్టియై
కడుకొని పుల్లగండపులకాంకురయైన ప్రియన్ భజించెదన్.

పృథుజఘనంబు గన్గొనెడి వేడుక పైకొన నేఁజటుక్కునన్
విధృతదుకూలచేల మొగ వెంటకు లాగిన పీడకుండ మేల్
విధముగ ముందుభాగమున లేచి చెఱంగుగ్రహించి సిగ్గుచే
నధరితవక్త్రయై యొదిగి యంజలి యొగ్గెడిజాణ నెంచెదన్.

నలిగియు పీడఁబాటెడిఘనం బగు వేనలిజీఱలాడఁ, జం
చలమయి వక్రమై తిరుగుసన్నని కన్నరమోడ్పు లొప్పఁ, గా
కు లఱువ లేచి యొల్లి వ్రేటిచికొంచుఁ గురుల్ సరిదిద్ది పంటినొ
క్కులు గలమోవిఁ గ్రొంజివురుఁగోళ్ళను నొత్తుమిటారి నెంచెదన్.

లలి నొకనాఁడు సౌధశిఖరంబున హాయిగఁగూర్చుండి త
న్నిలయమునొద్ద నిట్టులు దిగ్గునను బ్రియకన్నయంతటన్
గలకల నవ్వి నెచ్చెలులు గాఢముగాఁ బరిహాసమాడఁగన్
వెలవెలఁబాఱి మైపొలయులు పెల్లుగఁజూపు సువక్త్ర నెంచెదన్.

ఒకపరి నెగ్గొనర్చియుఁ బ్రియోక్తుల నేఁబతిమాలుకొన్నఁ జూ
డక పలుకినఁ దాలిచి తటాలున మోమటుత్రిప్పి యుంచఁదా
ళికపడి కౌఁగిలింప గగురందిన దయ్యును వద్దు వద్దటం
చకట! సహింప నట్లుపలుకాడెడుమాయలమారి నెంచెదన్.

తాలిమిఁ శో స్మరింతు శయితన్. క్షణబుద్ధను. మీలితాక్షి, ని
ద్రాలస నంగభంగ కలితన్, విమలోజ్జ్వలపాండుగండ. జృం
భాలలితోజ్జ్వలద్వదనపంకజమారుతగంధలోభసో
ద్వేలమదభ్రమద్భ్రమరవిభ్రమలోలవిశాలలోచనన్.

సంగడికత్తె లోండొరులు చల్లఁగఁ జేరి మదాలసేక్షణన్
సంగతి తామెఱుంగ నటు చక్కనియాతఁ డెవండె యంచుఁబల్
భంగుల మేలమాడ "నెటువాసి నెఱుంగ" మటంచు నబ్రమొ
ప్పంగ వచించియున్ గగురుపాటున మించినకాంత నెంచెదన్.

ప్రథమపుసంగమంపురతిఘక్కని లజ్జిత యైనజవ్వనిన్
మధురముగా గభీరముగ మందముగాఁ గనుఁగొంచునుండఁగా
నధరము కంద నుస్సురసురంచుఁ గడున్ శ్రవణోత్పలాగ్రమున్
విధుత మొనర్చుచున్ దళుకుబెళ్కులఁ జూపులతాంగి నెంచెదన్.

నిరతము నెంచెదన్ గమననిర్జితమానసరాజహంసినిన్
గురుతర కేశపాశపరికుంఠితకేకకలాపనున్ మనో
హరవర లోచనద్యుతి పరాకృతమత్తచకోరలోచనన్
సరసమృదూక్తి మాధురిమ నాశితకోకిల కంఠకూజితన్.

రతిసమయంబునం దలసి వ్రాలి యురంబున నాదుమోవి పెన్
గుతుకముతోడఁ బల్మొనల నొక్కుచు జల్లునఁ బుల్కరింప దో
ర్లతికలఁ బట్టి కౌఁగిటను గ్రక్కునఁ గ్రుచ్చియయారె! యర్థమీ
లితదృశయౌచు శయ్య నిదురించు ననంగపతాక నెంచెదన్.

తనకిరుప్రక్కలన్ జెలులు తారొక్కనిరా మదనోత్సవంబులన్
గనుఁగొనఁ గేళికావనికిఁ గాల్నడవచ్చుచునన్నుఁ జూచియున్
జనములుచూతురేమొయని చయ్యనఁజూపుమరల్చి వెండియున్
గనుఁగొనలన్ గనుంగొనుచుగ్రమ్మఱనొప్పెడి బాలనెన్నెదన్.

బలిమి నొడల్ విదిర్చికొనుభంగిని బొట్టను వక్కళించి దో
ర్వలయముపైకి నెత్తి చనుబంతుల నుబ్బఁగఁజేయుచున్ బళే!
వళులు నడంగ నారు కనుపట్టఁగఁ జేయుచు నాభిరంధ్రమున్
బొలుపుగ నాకుఁజూపుననఁబోణిని జాణను వ్రాసి గాంచెదన్.

ముద్దులమూట గట్టఁగలపొల్పగుమెల్లనిచిల్కపల్కులన్
నిద్దపుమేల్కనుంగొనల నీటగువంకరచూపుత్రిప్పులున్,
అద్దిర! యూరొయారినడలందములున్, జిఱునవ్వువెన్నెలల్
ముద్దువిలాసచేష్టలు ప్రమోదమునన్ మదిఁగాంతు నిప్పుడున్.

సురతములోన నన్నుఁగని చొక్కపుఁగన్గవ మూఁతవడ్డ, ముం
గురులుమొగంబుమీఁదఁబడిక్రొత్తహొయల్ గనిపింపఁజేయఁగా
వఱలుకురంగలోచనను స్వల్పకటిన్ సురతైకపాత్రినిన్
సరసిని రాజహంసగమనన్ భజియింతు సదామనంబునన్.

మెల్లనమూసి నేత్రములు మేల్కనుబొమ్మలుపైకిఁ జిమ్ముచున్
దెల్లసచెక్కిళుల్ కరము నీటు చలింప గళంబు వంచియున్
ఘల్లున హస్తకంకణఝణంకృతు లొప్పఁగఁ గర్ణమందు వ్రే
లల్లనఁజొప్పి గోకికొను నన్నులమిన్నను లోన నెన్నెదన్.

స్వాంతమునన్ గుదుర్పడి విచారము లేక వధానిసొంచు జ
న్మాంతరమందుఁ గూడ విరహంబు జనింపకయుండు నట్లుగన్
సంతగవల్లవేసెదను సంతతమున్ హృదయేశ్వరిన్ సుసీ
మంతిని నాన్యభుక్త నవయౌవనపూర్ణతనూ విభూషితన్.

ఔర! యొయారపుంగనుల యందపు వంకరత్రిప్పు చొప్పు, ల
య్యారె! రతంపువిభ్రమమునందలి పత్రలతావిభంగికన్
మీఱెడి యాస్యపుం దళుకు; మేలు కరంబులఁ గప్పుగుబ్బ; లా
హా! రమణీయదంతవ్రణితాధరమున్ మదిఁబాయ విప్పుడున్.

చ. నలిగియు వీడఁబాఱినఘనం బగు వేనలినుండి క్రొవ్విరుల్
జలజలరాల, నున్నతకుచంబులపై సరముల్ నటింపఁగా
నలఁత నొడల్ చెమర్ప వదనాబ్జము వాడ రతంపుఁబోరిలో
బళి! చిఱునవ్వునవ్వి తలవంచినకంబుగళన్ దలంచెదన్.

సౌరతకేళిలోన నిశిజాగరముండుటఁ జేసి సోలుచున్
దారలు చంచలంబు లయి తెద్దయు వక్రములై తగన్ద్రపా
భారమునన్ ముఖాంబుజము వంచు మనోహరఁ గాంత నెంతు శృం
గారవిహారహారికమలాకర రాజితరాజహంసినిన్.

చ. సకలలాసనాథశశిసన్నిభవక్త్ర, విశాలనేత్రఁ బు
ష్పకమృదుగాత్ర, రాజదలసాలసవిహ్వలగాత్రఁ దుంగపీ
నకుచసువర్ణపాత్రభరనమ్ర, విలోలితనీవివస్త్రఁ గ
ప్రకటిఁ దలంచెదన్ సురతరంగపునర్తనసూత్రధారిణిన్.

ఉ. స్వాంతసరోజలీనమధుపాంగనతో మృగనేత్రతోడ మూ
ర్ఛాంతర నిశ్చలాకులదృగంచలతో విడఁదీయకుండ జ
న్మాంతరమందునైనఁ గరుణార్ద్రితఁ గోపము వీడి బ్రహ్మ మా
కెంతయు సంతసంబుఁ గలిగించెడుఁగాక యటంచు నెంచెదన్.

చ. విరివిలుకాని యగ్గలపు వేఁడిమిజ్వాలల కోర్వలేక క
న్నరమొగిడించి చిర్నవుల నప్పటిభావము దెల్పుచౌర! చె
చ్చెఱ నెద వ్రాలి మైమఱచు జీవముకన్న నభీష్ట యామనో
హారి! ననుకంప్య, ముగ్ధ నెద నమ్మకచెల్ల! స్మరింపకుందునే.

ప్రాంచదనంగ సంగరవిహార విరాజిశరీరయై విజృం
భించియుఁ గేళులన్ మిగుల మించఁగ నేనిఁక వద్దు వ
ద్దంచు వచింప భీతమృగియట్టులఁ జంచలనేత్రయౌచు నే
త్రాంచలపూరితాశ్రుకణ యాప్రియ ధ్యాన మొనర్తు నెమ్మదిన్.

వదనసరోజ మానిమధుపానము చేయఁగ వచ్చి గండుతు
మ్మెదగమి ముద్దుపెట్టుకొని మించియొనర్చెడి ఝంకృతంబులన్
బొదివిన కష్టభూత మృదుముగ్ధ కరద్వయకంకణక్వణం
బది విని నప్పుడెల్ల హృదయంబు హటాత్తుగ వ్రీలిపోవదే.

హరుఁ డిపుడేనియున్ వదలఁడయ్యెను దుస్సహకాలకూటమున్
ధరణిని బృష్ఠభాగమునఁ దాల్చి భరించును గూర్మరాజు; తాఁ
గరము దహించినన్ జలధిగట్టిగఁ దాల్చును బాడబాగ్నినిన్
మఱియొక రీతిఁ జేయుదురె మాన్యులు చేయఁగ స్వీకరించినన్.

సీ. నాలోని భూమిని నా ప్రియ మృదుపాద
ముల నొత్తుభూమిలోఁ; గలుపవయ్య
నాలోని జలముల నాప్రియ జలకేళిఁ
దేలెడు సరసిలోఁ దేల్పవయ్య
నాలోని తేజస్సు నాప్రియ నగుమోముఁ
గాంచునద్దంబులోఁ గలుపవయ్య
నాలోనిచిఱుగాలి నాప్రియ విసుకొఱ
వీవనగాలిలో విడవ వయ్య

తే. నాదునభము నాప్రియచుట్టు నాటవయ్య
తత్తదంశలు పంచభూతములఁ గలుపు
మిదె విధాత! నేయాచించు తుదివరంబు
తనువు పంచత్వ మొందినఁ దనట గనను.

క. అని కవి యిట్లు విలపింపఁగ
వినతాననులై కనుఁగొని వేగ జనంబుల్
వినిపించిరి విస్తరముగ
మునుపట వినినట్టిదాని ముదమునఁ బతికిన్.

తే. అట్టికవికుల భూషణు ననునయించి
సంతసంబును జూపుము చనుము లెమ్ము
అనెడివారి మాటలువిని యవనిధవుఁడు
కవివతంసుని రప్పించెఁ గరుణఁ గరఁగి.

వ. అట్లు రావించి కవిచంద్రునిఁ బ్రసన్నునిగావించి యగ్నిసాక్షి
కముగాఁ దనతనయనొసఁగి మహావైభవముగాఁ బెండ్లిగా
వించె. అంత నొక్కనాఁటి నిశాముఖంబున బ్రేమతప్తుఁడగు
మనోహరుం గాంచి ప్రమోదవీచికలఁ దేలియాడుచు రాజ
కుమారి యాతని కిట్లనియె–

మాటు మడంగలే, దిఁకను మానవులుర్‌ నిమరింపలేద యి
ప్పాటున దీపముల్ వెలుఁగుఁ; బ్రక్కసఖుల్ గుతుకంబుతోఁ గనన్
జాటుగ నున్నవారు ప్రియ! చాలు! ముహూర్తము తాళరాదొకో
గాటము గా క్షుధార్తుఁడగుఁగాక భుజించునె రెండుచేతులర్‌.

తే. పిదప రాజును దనయయు బిల్లణుండు
లక్ష్మికిన్ వాస మైనపురంబునందుఁ
జాల సుఖముగ రాజ్యంబు నేలుచుండి
లక్ష్మిపతి దివ్యదృష్టిపాత్రతను గనిరి.

ఇది తృతీయ తరంగము

సమాప్తము

# అజవిలాపము

కాళిదాసకృత రఘువంశము నుండి.

# అజవిలాపము *

క. అది యొక వసంతయామిని
యుదయించె సుధాకరుండు జ్యోత్స్నలు పర్వెన్
వికశిత సుమ సౌరభముల
వెదఁజల్లుచుఁ బిల్లగాలి విహరించెఁ గడున్. ౧

తే. అట్టి యానందమయ సమయంబునందు
రమణికై దండఁ బూని యారామభూమి
నజమహారాజు విహరించె స్వాంత మలర
శచినిగూడి నందనమున శక్రుపగిది. ౨

తే. సరిగ నప్పుడె దక్షిణజలధితీర
వాసి గోకర్ణపట్టణేశ్వరునిఁ గొలువ
దక్షిణాయనలోకబాంధవునిపగిది
నారదుం డేగుచుండెను నాకవీథి. ౩

తే. అట్లు లేగుచునుండ రయాన గాలి
బహుళపరిమళజన్యలోభమునఁబోలె
నమ్మునీశు వీణాశిరోన్యస్తమైన
దివ్యసుమమాల హరియించి తివిరె భువికి. ౪

---

* ౧౯౩౦ లో ౨౧ వ యేట రచించిన రచన.

తే. పవనుఁ డవమానపఱుపఁగ వంతఁ గుమిలి
నిడుదకాటుకరంగు కన్నీటిధార
విడుచు చున్నదివోలె నవ్వీణ యొప్పె
విరులకై వచ్చునళిపంక్తి దరిని వ్రేల. ౫

తే. మధుర మకరంద సౌరభ మధికమగుట
సుందర వసంత ఋతులతాశోభఁ దెగడు
సమరసుమమాల యజుని యర్ధాంగియెడఁద
స్తనములంబడి యుచితమౌ స్థానమొందె. ౬

తే. రుచిరరుచిరంబులై మీఱుకుచములందు
నొక్కక్షణ మున్నసుమమాల నుదరిపడుచుఁ
గాంచి యజురాణి భయమునఁ గనులు మూసె
రాహుహతచంద్ర చంద్రికరహిని నకట ! ౭

తే. అంగములపట్టు సడలు దేహమున నబల
పుడమిఁ బడుచును బ్రియుఁగూడఁ బడఁగనై చెఁ
గాటి జాటి పోయెడి తైలకణముతోడ
రూపు చెడి నాశమొందదే దీపకాంతి. ౮

కం. ఇరుపుర పార్శ్వమునం గల
పరిజనముల యార్తరవము భయమున్ గొలుపన్
సరసీ విహారి విహగము
లఱచి సమవిచారము లటు లాక్రోశించెన్. ౯

తే. విమలవాయువు ప్రసరింప విసరి విసరి
శీతలజలోపచారముల్ చేయఁ జేయ
నజుఁడు తెలివొందెఁ బ్రియమాత్ర మట్లె యుండె
జతనము ఫలించు జీవశేషంబె యున్న. ౧౦

తే. తీవె లన్నియుఁ దెగిపోయి దీప్తిసెడిన
వీణవలెఁ బడి చైతన్య హీనయైన
ప్రియను ప్రేమమయుఁ డజుండు లేవఁదీసి
యుచిత మగుతనతొడపైని నునిచికొనియె. ౧౧

ఉ. ఉదయకాలాన సుందరద్యుతులు దఱిఁగి
మలినమృగలేఖఁ దాల్చు శీతాంశుపగిదిఁ
జెలఁగె నాదీనజనపతి చేష్ట దక్కి
జీవకళఁ బాసి తొడ నున్న చెలియతోడ. ౧౨

తే. ప్రకృతిసిద్ధమా ధైర్యముఁ బాసి యజుఁడు
కరుణవిలపించె గద్గదకంఠుఁ డగుచు
నినుమె తపియింపఁబడి మెత్తఁదనము నొందఁ
బ్రాణి తపియింపఁబడి మెత్త నగుట యరుదె. ౧౩

తే. అలరుదామముగూడ దేహమున సోఁకి
ప్రాణములఁ దీసివేయ సమర్థ మేని
యలుకఁ బూని యకట! చంపఁదలఁచి నపుడు
ఏది కాదు విధాతకు సాధనంబు. ౧౪

తే. మృదు పదార్థముచేతనే మృదుపదార్థ
మెపుడు హింసించు నౌచిత్య మెఱిఁగి యముఁడు
ననుపుఁ దెలిమంచుసోనలఁ దనువు దొఱఁగు
తమ్మితీవ యిందుఁ దొలి నిదర్శనంబు. ౧౫

తే. ఈయలరుదండ ప్రాణాలుదీయు నట్టి
దేని యెద నుంచినను జంప దేల నన్ను;
అహహ ! విషమేని నొకపరి నమృత మగును
విధివశంబున నమృతమున్ విషమె యగును. ౧౬

తే. లేక నాదురదృష్టంపు రేకవలన
విరులదండఁ బిడుగుగఁ గల్పించె బ్రహ్మ
యీపిడుగు పాదపమును మాయింప దయ్యెఁ
గాని దానిఁ బ్రాఁకిన తీవఁ గాల్చె నకట ! ౧౭

తే. ఎంత దోసము చేసిన నుంతయేని
కోపగింపవు నాపయిఁ గోమలాంగి !
యకట ! నిరపరాధుఁడ మాటలాడఁ దగని
జనుఁడ నైపోయితినె యొక్క-క్షణములోన. ౧౮

తే. శఠుఁడ ననియును గపటవత్సలుఁడ ననియుఁ
దథ్యముగ శుచిస్మిత ! నీవు దలఁచియుంటె
వట్టి గాదేని దివికి నన్నడుగ కుండ
నింక రాకుండఁ బోదువే యిచటినుండి. ౧౯

తే. అదిఁ బ్రియవెంటఁ జనినది యట్లు చనక
పిదపఁ దానొంటి రానేల ప్రియను వీడి
నాదు పాపుజీవము స్వాపరాధమునకు
నరకయాతన సహియింపవలసినదియొ. ౨౦

తే. రతిపరిశ్రమ జన్య ఘర్మాంబుకణము
లిప్పటికి నీదుమోమున నింకిపోవు
ఇంతలో రూపు చెడి యస్తమించి తీవు
ఛీ! శరీరము లెంత యస్థిరములొకో. ౨౧

తే. హృదయమందును నప్రియ మింతదనుక
నెంచియుండను ననువీడి తేల చెలియ!
పదమునకు మాత్ర మవనికిఁ బతిని గాని
సత్య మగుప్రేమ నీయందె నిత్య మలరు. ౨౨

తే. ఉంగరములు తిరిగి తేంట్లద్యుతిని దెగడు
విరులు దుఱిమిన నీదుముంగురులు గదిపి
జీవితేశ్వరి! పవనుఁడు "నీవు తిరిగి
యరుగుదెంతువో" యని మది కాసగొలిపె. ౨౩

తే. కానఁ బ్రేయసి! మెలఁకువ గాంచి వేగ
నా విషాదము మాన్పఁగ నీవ తగుదు
మందునోషధి దీప్తిచే మంచుఁగొండ
తనదుగుహఁ జొచ్చుచీఁకటి దఱుఁగుఁ గాదె. ౨౪

తే. ఈమొదలుచున్న ముంగురుల్ ప్రేమకథలు
దెలుపకయె పడియున్న యీకలికిమోము
నన్ను బ్రిల్చు నంతరళిగానములు లేక
పాడుపడి రాత్రిమొగిడినపద్మ మట్లు — ౨౫

తే. చందురుని యామినీకాంత; చక్రవాకి
తనప్రియుని మఱలఁ గలసికొనుచు నుండుఁ
గాన వారలు తమవియోగము సహింత్రు
ముదిత! యెట్లోర్చు నీవ దేపోవఁ బోవ. — ౨౬

తే. క్రొంజివుళ్ల పానుపునందుఁ గూడ నీదు
సుందర మృదు దేహము నుంచఁ గందిపోవు
నిట్టియెడఁ గరభోరూ! వచింపు; కటిక
కాటిఁబడి యెట్టులోర్చు నీకాయలతిక. — ౨౭

తే. ఘల్లు మనుచప్పు నీకేవిగతుల తోడ
నణఁగఁ దొలిరహస్యసఖి యీహైమరశన
నీవు స్పృహతప్పి పడియుండ నీదువెంట
నార్తి మరణించినటులతోఁచు నరయు మిదిగొ. — ౨౮

తే. కలనినాదము లాడు కోయిలలయందు
మదవిమంథరగతు లంచముదితలందుఁ
జంచలావలోకము లేణసతులయందు
హొయలు గాలి కల్లాడు తీవియలయందు. — ౨౯

తే. నాకదర్శనోత్సుక వయ్యు నన్నుఁ గాంచి
నిజము నీవిట్లు గుణములు నిలుపఁబోలుఁ
గాని నీ వియోగమువల్లఁ గఠినవరక
మనుభవించు చిత్తము నవ్వియాప లేవు. 30

తే. అదిగో సహకార మిదిగో! ప్రియంగులతిక
వీని దాంపత్య మీవు కల్పించినావు
కాని వానికిఁ బెండ్లి సత్కారమేని
యాచరింపక చనుట భావ్యంబె సకియ. 3౧

తే. ఇదె యశోకము నీవు దోహదము చేయ
వఱలె; నేఁడో రేపో యింక విరులు పూచుఁ
గురులఁ దుఱుమంగఁ దగిన యీవిరులు చెలియ!
యెట్లు తర్పణముగ నీకు నీయఁగలను. 3౨

తే. నూపురాల్ ఘల్లుమన నీవనుగ్రహించు
నన్యదుర్లభ మృదుపాద హతిఁ జిగిర్చి
నీయశోకము పూవుకన్నీటిసరులఁ
గురిసి శోకించు నిదె చూడు కుసుమగాత్రి! 33

తే. అకట! నీదు నిశ్వాసంబు ననుకరించు
పొగడ పూవులు నాతోడ సగము గ్రుచ్చి
పోయగంపుమేఖల పూర్తి సేయకుండ
నిట్లు కిన్నరకంఠి! నిద్రింపఁ దగునె. 3౪

తే. వారు సమదుఃఖసుఖు లైన ప్రాణసఖులు
వీఁడు విదియచందురుఁ బోలుపిన్నపాప
నేను భవదేకప్రేమరసానుజీవి
నయిన నతినిష్ఠురంబు మాత్యాగ మబల ! ౩౫

తే. ధైర్యము నశించె; భోగాశ తరలి పోయె
నుడిగె గానంబు; ఋతువుల్ నిరుత్సవములు
అఖిలభూషణసాఫల్య మస్తమించె
నకట ! శయనీయ మిఁక శూన్య మయ్యెఁ బడఁతి ! ౩౬

తే. ధర్మపత్నివి మంత్రివి నర్మసఖివి
లలితకళలందుఁ బ్రియశిష్యురాల వీవు
నిర్దయం బగుమృత్యువు నిను హరించి
యింకఁ బ్రియ ! నాది యేమి హరింపలేదు. ౩౭

తే. మోము మోమునఁ గదియించి ప్రేమ నిపుడు
మధుర రసయుక్త గండూష మధువు లాని
యకట ! మదిరాక్షి ! యెట్లు నాకంటినీటఁ
గలఁగిన తిలోదకము ద్రాఁగఁగలవు దివిని. ౩౮

తే. ఇంతయైశ్వర్య మున్నను నీవు లేమి
నజుని కిఁక నింతవఱకె సౌఖ్యంబుసుమ్మి
యితరవిషయాలవలన హరింపఁబడని
యజుని కెల్ల భోగములు త్వదాశ్రితములు. ౩౯

తే. ఇట్లు దీనాతిదీనుఁడై నృపతి దయిత
నెంచి ముక్తకంఠత విలపించుచుండఁ
దరువులునుగూడ నిలువెల్లఁ గరఁగి పోయి
వ్రాల్చెఁ బువ్వుఁగన్నీల మరంద బాష్పములను. ౮౦

తే. ధాత్రివిభుఁడు జ్ఞానియయ్యు శోకమునఁ దవిలి
తనదు ప్రియతోడ మరణించె ననెడి వాదు
పడఁగలే కగ్నిఁ బ్రియవెంటఁ బడఁడు గాని
ప్రాణములమీఁదఁ గలయాశవలనఁ గాదు. ౮౧

తే. స్వప్రియా శాపవృత్తాంత శ్రవణమునను
స్వగురు శిష్యునియాశ్వాసవచనములను
స్వాత్మజుఁడు రాజ్యరక్షకక్షముఁడు నగుట
నెటులో విరహంబు సహియించె నెనిమిదేండ్లు. ౮౨

తే. తనదు హృదయేశ్వరీ చిత్రదర్శనములఁ
దరుణి సాదృశ్య వస్తుసందర్శనముల
క్షణిక మగుస్వప్నదర్శనోత్సవముచలనఁ
గడచె నేండ్లన్ని కష్టాతికష్టముగను. ౮౩

తే. మించి జువిమొల్క కోఁట భేదించుపగిది
నజునిహృదయము శోకశల్యము పగిల్చె
సద్ది వైద్యసాధ్యముగాక ప్రాణహారి
యయ్యెఁ బ్రియఁ జేరఁ గడులాభ మతని కయ్యె. ౮౪

తే. కవచధారణాప్తు వినీతుఁ గన్నకొడుకుఁ
బ్రజల నయరీతిఁ బాలింపఁ బనుపు చేసి
యాధికృశదేహదుస్థితి యస్తమింప
నృపతి ప్రాయోపవేశంబు నెఱపఁ దలఁచె. ౮౫

శా. శ్రీగంగాసరయూ సమాగమ మహాక్షేత్రంబునందున్ దను
త్యాగం బాచరియించి దేవగణనాఖ్యాతిన్ వడిన్ బొంది త
త్ర్వాగాకృత్యధికోజ్జ్వలాంగి యగుస్వప్రాణేశ్వరిన్ గూడి స్వే
చ్ఛాగోష్ఠిన్ విహరించె నందనవనీసౌధాగ్రభాగంబులన్.

ఇ ది

అ జ వి లా ప ము.

# శుక రంభా సంవాదము*

రంభ:

తోటఁ దోటఁ గ్రొత్త మామావిపూఁతల్
పూఁతన్ బూఁతఁ గోయిలల్ ముద్దుపాటల్
పాటన్ పాటన్ మానినీమాన బాధల్
బాధన్ బాధఁ మారువాహ్యాళు లొప్పన్. ౧

శుకుఁడు:

తోటన్ దోటఁ లభ్యమౌ సాధుమైత్రుల్
మైత్రిఁ మైత్రిఁ బ్రేమగంధన్ గృష్ణకీర్తుల్
కీర్తిఁ గీర్తిఁ గృష్ణు సమ్మోహమూర్తుల్
మూర్తిఁ మూర్తిఁ మించు నానందభాసల్ ౨

యాత్రన్ యాత్రఁ శుద్ధ మహాబ్రహ్మపంక్తుల్
పంక్తిఁ బంక్తిఁ గూఢ మహాతత్త్వచింతల్
చింతఁ జింతన్ రాజిలుఁ దత్త్వబోధల్
బోధఁ బోధఁ వెల్గు భర్గావభాసల్ ౩

రంభ:

కొంపన్ గొంపఁ దిగ్గు బంగారుతీవల్
తీవఁ దీవఁ బూర్ణిమాచంద్రరేఖల్
రేఖన్ రేఖఁ దళ్కునుఁ బాలజంటల్
జంటన్ జంటఁ నూఁప్రాఘుఁక లొల్కున్. ౪

---

* ౧౯౩౪ లోని రచన.

శుకుఁడు :

తావుక తావుక సొంపగున్ రత్నవేదుల్
వేదిక వేదిన్ సిద్ధ గంధర్వగోష్ఠుల్
గోష్ఠిక గోష్ఠిన్ గిన్నర ద్వంద్వగీతుల్
గీతిన్ గీతిన్ బొల్చు శ్రీరామభక్తుల్ ౫

రంభ

గిరుపవుఁ బ్రాయమందు నవకంబున నిగ్గులు దేఱు మేనఁబల్
సరణులఁ జెన్ను మీఱఁగ నలందినగందము తావు లీన న
బ్బురముగ నుబ్బుచన్నుఁగవఁ బొల్చెడు నమ్మదిరాక్షిఁ బ్రేమ ని
ర్భరమునఁ గౌఁగిలింపనియభాగ్యుని జీవితమే వృథా సుమా !

శుకుఁడు :

మునులునుగూడ నిట్టిదని పోల్పఁగ శక్యముగాని రూపమున్
గాని సకల ప్రపంచములు కుక్షి భరించి చిదాత్ముఁడై నిరం
జను భగవంతు నవ్యయుని జ్ఞానమయున్ క్షణమేనిగూడ భా
వనఁ బరిశోధసేయని యభాగ్యునిజీవితమే వృథా సుమా ! ౬

రంభ :

మృదులమృణాలపాండురశరీరము లోకము మోహపెట్ట శా
రద పరిపూర్ణచంద్రరుచిరంబగు మోమున దొండపండుఁబోల్
పెదవి మదిన్ గలంప రతిలిప్సఁ గలంగునొయారి నక్కనన్
బదపడి కేలనూపని యభాగ్యునిజీవితమే వృథా సుమా ! ౭

శు కు( డు :

పాణులు నాల్గుఁగూడ నలువైపులఁ బెంపునుసొంపు నింపఁగాఁ
బూనికఁ జక్రమున్ గదయుఁబూనుచుఁ బచ్చనిపట్టుఁ బుట్టమున్
మేన ధరించి కౌస్తుభమణిన్ దగుమాలిక దాల్చు శ్రీహరిన్
ధ్యాన మొనర్పకుండిన యధన్యుని జీవితమే వృథాసుమా ! ౯

రంభ :

దినముదినమ్మునన్ నసలు దేఱెడు యౌవననూత్నలక్ష్మికిన్
మునుకొని చక్కఁదిద్దిన మనోహరవేషము వన్నెగూర్ప శో
భనఘనసార చందనలవంగ సుగంధి నొయారి బాహుమ
ధ్యను బిగియార గ్రుచ్చనియధన్యుని జీవితమే వృథా సుమా !

శు కు( డు :

పాయక నాల్గుబాహువుల బాహుపురుల్ రుచులీన రత్నశో
భాయుత కుండలద్యుతుల వక్త్రము చెన్నువహింప నొప్పు నా
రాయణుఁ బంకజాక్షు మనసార సమాధిని గూర్చుచుండి ని
ధ్యాయిత వృత్తిఁ గొల్వనియధన్యుని జీవితమే వృథా సుమా !

రంభ :

బెడఁగుపసిండిడాల్ పరొటములు, విచ్చిన సంపెఁగ పూవుఁగ్రొవ్వులా
గొడలఁదొఱంక నెన్నడుము, నూ యెలఱూఁ గెడిమ త్రెప్పన్ సవల్
కడఁగిగొయ్యారముల్ నెఱపఁగా ముకిల్లై ప్రియమాడు ప్రోడఁబైఁ
బడి రతికేళిఁ దేల్పని యభాగ్యునిజీవితమే వృథా సుమా ! ౧౦

శుకుఁడు :

తే. మురువు పెడఁద శ్రీవత్స మన్పుట్టుమచ్చ
యమరఁ గరుడధ్వజుఁ డయి శార్ఙ్గము ధరించి
యెసఁగు పరమాత్ము నరజన్మ మెత్తికూడ
స్మరణ సేయఁ డెవ్వఁడు వానిజన్మ మేల. ౧౩

రంభ :

తే. అందెలు ఘలుఘల్లు రనఁ బిఱుందు లదర
మురువు ముత్తెంపు ముంగర ముద్దు లొలుక
భువన మోహన మగు నీలభుజగవేణి
సరస మనుభవింపనివాని జన్మమేల. ౧౪

శుకుఁడు :

తే. జ్ఞానమయు ననంతగుణు జగత్స్వరూపు
సకల విశ్వంభరుఁ బరమేశ్వరుని మదిని
గొలువకయును యోగమున భక్తిఁ దలఁపకయును
జగతిఁ జరియించు మనుజుని జన్మమేల. ౧౫

రంభ :

పూలసువాసనల్ మిగుల ముమ్మరమై వెలయన్ సముద్గతో
త్తైలపరీమళంబు లెదఁదన్పుచు నుండఁగఁ గప్పురంపుఁ దాం
బూలపుఁదావి ఘుగ్గురన మురొఁగను బిత్తరిగబ్బిగుబ్బలన్
వ్రాలి కరాల గ్రుమ్మని యభాగ్యుని జీవితమే వృథా సుమా!

శుకుఁడు :

నిరతము "నాది దేవు"డని నీరజగర్భుఁడు సర్వదేవతల్
గురుతరభక్తిఁ గొల్వ సకలోత్తమ మోక్షపదంబు లిచ్చుచుం
బరమ ప్రశాంత మాస్యమునఁ బర్వ గుణత్రయి మించియొప్పు నీ
శ్వరు మది నిష్ఠఁగొల్వని యభాగ్యుని జీవితమే వృథా సుమా !

రంభ :

కస్తురి కుంకుమంబును సుగంధము చక్కఁగ మైనలందియున్
నిస్తులధూపవాసనలు నిండిన సన్నని పట్టుఁ బుట్టముల్
ప్రస్తుత మూఁచు మేను మఱువన్ దిలకించెడు మత్తకుంభి కుం
భస్తనియెద్ద దొర్లని యభాగ్యుని జీవితమే వృథా సుమా !

శుకుఁడు :

సుందరమూర్తి నాత్మమున శోభిలి తన్ను నెఱుంగు జ్యోతి, నా
నందమయప్రపూర్తి బహునామములున్ బహురూపులొందియుం
దందు సమస్తదేశములయందు వెలింగెడు దివ్యమూర్తి నా
త్మం దపమాచరింపని యధన్యుని జీవితమే వృథా సుమా !

రంభ :

ఉబ్బిన గబ్బినిబ్బరపుటుబ్బున గుబ్బలు మేసి నెల్లఁ ద
బ్బిబ్బులొనర్ప, నెన్నడుము వింతయొయారము చూప నొంటిమై
నబ్బిన ఖంజనాక్షిని హిమర్తువునం గవుఁగింటఁ గ్రుచ్చి మే
లబ్బురమై రమింపని జడాత్ముని జీవితమే వృథా సుమా !

శుకుఁడు :

కాంతిమయుండు చిన్మయుఁడు, జ్ఞానమయుండు తపోమయుండు వే
దాంతమయుండు యోగమయుఁడాత్మమయుండుజగన్మయుండనా
ద్యంతమయుండు నైనపరమాత్ము సమాధిని గూర్చుచుండి య
త్యంతము భక్తిఁగొల్వని జడాత్ముని జీవితమే వృథా సుమా !

రంభ :

గుణముల(ప్రోవు మానవతి కోమలి శోభనలక్షణాఢ్య సా
సిని మృదువాక్యభాషిణి సుశీలఁ బ్రశాంత ముఖారవిందయౌ
వని తను గౌఁగిటన్ బొదివి పైకొనుమోహముఁగోడఁ బొంగుచున్
మునుకొని ముద్దులన్ గొనని మూర్ఖుని జీవితమే వృథా సుమా !

శుకుఁడు :

తే. తరుణి వలని సుఖంబు తాత్కాలికంబు
కామినీభోగసుఖము దుఃఖప్రదంబు
అని యెఱింగి శాశ్వతము సౌఖ్యంబొసంగు
సర్వవిభునిఁ గొల్వని వాని జన్మమేల. — ౧౩

రంభ :

తే. పిఱుఁదులను ముద్దుగొనువేణి, మరునిగూడ
మోహపెట్టు రూపము, గల్గు మోహనాంగిఁ
గౌఁగిటను బొదివి వసంతకాలమందు
సరగ ననుభవింపని వానిజన్మమేల. — ౧౪

శు కుఁ డు :

తే. మాయలకు నిధానము ఘోరనరక గృహము
సకలతపముల ప్రళయంబు, సుకృతహరము
మనుజులకు నెల్లఁ బతనకారణము నయిన
దాన సేవించు మూర్ఖుని జన్మమేల. ౨౫

రం భ :

తే. సకల శృంగార మదవిలాస స్వభావ,
శ్రావ్యకోకిలకంఠ సుస్వరనినాద
యగు నొయారిని నడిమి ప్రాయంబునందు
సరసములఁ దేల్పని యభాగ్యుజన్మమేల. ౨౬

శు కుఁ డు :

తే. ధర్మమార్గ కుమంత్రియు ధ్యానహంత్రి
జనవిమోహయంత్రియును, వంచనలతంత్రి
యఖిలసత్కర్మ హంత్రియు నగుపడంతి
జడత సేవించుమూర్ఖుని జన్మమేల. ౨౭

రం భ :

క. పూరేడు పండ్లవంటి ని
గారపుఁ జన్నులఁ గుసుమసుగంధము మెఱయన్
గారిశరీర సుశీలను
మీఱి మోడఁ బొందనని జన్మమేటికి నింకన్. ౨౮

శు కుఁ డు :

క. చింతల దొంతఁగుల నిండిన
సంతాపపుఁగొట్టు సర్వజనమోహినిఁగ

ష్టాంతర సంసృతి బాధము
నింతిని గనుమూర్ఖజన్మ మేటికి నింకన్. ౨౯

రంభ:

క. అందెలు మణికంకణములు
క్రందుగ ఘులుఘుల్లుఘుల్లు రని రొదసేయన్
కందర్పవిలాసిని యా
నందిని యధరసుధ గొనని నరులది బ్రతుకే. ౩౦

శుకుఁడు:

క. పలుమాయలు గలవంచకి
మలమూత్రపు ముఱికికొంప మఱిపైపైడా
బుల మేడిపండు కూళను
లలనను సేవించుమూర్ఖప్రజలది బ్రతుకే. ౩౧

రంభ:

క. పూర్ణేందు బింబవదనను
స్వర్ణోజ్వల దేహవర్ణ వ్యక్తస్తనినిన్
పూర్ణాంగ భోగవిలసిత
వర్ణిత శయనమునఁ గననిబ్రతు కింకేలా. ౩౨

శుకుఁడు:

క. మదిరాపానోన్మాదిని
మదిపతితన్ సర్వలోక మాయాంకరిసన్
అధికతరపాపదఁ గదిసి
పదపడి యాశ్వరుఁ గొలువనిబ్రతు కింకేలా. ౩౩

ర ం భ :

క. తరుణియు నతాంగి సుందరి
పరమానందమయి ధర్మపథవర్తినియున్
వరకామార్థప్రద యై
వ్వరియింట మెసలదో వానిబ్రతు కేమిటికిన్. ౭౫

శు కు ఁ డు :

క. ఒడలో ముఱికిది, స్వభావము
పడిపోయెను నడత లోభబహుళంబయ్యెన్
నుడులో యసత్యము, లాసతి
పడసి హరి మఱచినవాని బ్రతు కేమిటికిన్. ౭౬

ర ం భ :

తే. అతికృశోదరి మదమత్తహంసగమన
పరమ సౌందర్య సౌభాగ్య భాగ్యసీమ
మృదుల చంచల, కాంత యభీష్టముగను
రతులఁ దేల్పని మూర్ఖునిబ్రతుకదేల. ౭౭

శు కు ఁ డు :

తే. ప్రకట సంసార భావనభక్తి లేక
పరులచిత్తంబు హరియించి కరుణలేక
స్వార్థపరయౌచుఁ జరియించువనితఁ గనిసి
భక్తి నీశుఁ గొల్వని మూర్ఖుబ్రతుకదేల. ౭౮

ర ం భ :

తావి గుమ్మరించు పూలు తల్పముల్ లతాంగియున్
శ్రీవసంత రమ్యవేళ నిండుపండు వెన్నెలల్

భావమూలఁగా రసానుభావ మొందదె లేనిచో
నేవియుండి యేమిలాభ మేమియున్న నేటికిన్. ౩౮

శుకుఁడు :

ఆహారనంబు మేసియుంద మానహీన భార్యయున్
శ్రీవిశాలవైభవంబు చిత్రవాక్యచాతురుల్
ధ్యానమే మహేశుపాద పద్మమందు లేనిచో
నేవి యుండి యేమిలాభ మేమి యున్న నేటికిన్. ౩౯

రంభ :

చెన్నగు క్రొన్ననల్ విరియు చెల్వపు నూత్నవసంత వేళలన్
క్రొన్నన తేనియల్ చిలికి కూరిమి గూయుచుఁ బూవుఁదోఁటలన్.
అన్నులమిన్న యున్నతకుచాంతర మేనకుఁ దాశ్రయింపఁడో
తన్నరు జీవితమ్ము పతితమ్ము హతమ్ము మృతమ్ము సుమ్మిఁకన్.

శుకుఁడు :

సన్నుత మైనజ్ఞానమునఁ జొక్కుచు మోక్షపదంబు నొందఁగాఁ
దిన్నని ధర్మమార్గముల తీరు తెఱుంగుచు యోగమొందు దా
స్వస్థియు దాటి యీశ్వరుని ధ్యానసమాధి నెవండు చేరఁడో
తన్నరు జీవితమ్ము పతితమ్ము హతమ్ము మృతమ్ము సుమ్మిఁకన్.

రంభ :

అన్నువమోహమునుండి రుచిరైలక జాతిలవంగ వాసనల్
గ్రన్ననఁ బర్వఁ దమ్ములపు రక్తిమ యోష్ఠములన్ విరాజిలన్
దిన్నని పూవుఁబోఁడి కమనీయముఖం బెనఁడాదరింపఁడో
తన్నరు జీవితమ్ము పతితమ్ము హతమ్ము మృతమ్ము సుమ్మిఁకన్.

శుకుఁడు :

కనఁబడి నీటిలోనిబుడగంబలె వెంటనె రమ్యమైన యౌ
వనము నశించు; నిప్పటికి వచ్చిన దుర్లభమర్త్య జన్మమున్
గనియును నాత్మసద్గతిని గోరియెవండు భజింపఁడీశుఁ డ
మ్మనుజుని జీవితమ్ము పతితమ్ము హతమ్ము మృతమ్ము సుమ్ముకన్.

రంభ :

నునువలిపంపుఁ బయ్యెదలనుండి తొణంకెడు సిగ్గులెంతయున్
మునుకొన, లోనిచందనపుఁ బూఁతలరీతుల తావులీను నా
స్తనములదిండులన్ దొరలి జన్మతరింప సుఖింపకుండు త
న్మనుజుని జీవితమ్ము పతితమ్ము హతమ్ము మృతమ్ము సుమ్ముకన్.

శుకుఁడు :

తే. ఎందుఁ బుట్టిరో యందె రమించుచుంద్రు
ఏవి త్రావిరో యవియె మర్దించుచుంద్రు
ఎంత బోధించిన విరక్తి సుంత గనరు
జనులలోఁ బాతుకొనిన యజ్ఞాన మౌర! ౭౫

రంభ :

తే. అమృతపూరంబు చిలుకు భాండములువోలె
సకల భోగభాగ్యముల కోశములువోలె
మనసు మఱపించురతికేళి వనులువోలె
ఎవరు దిద్దిరో పువుఁబోండ్ల యవయవములు. ౭౬

శుకుఁడు :

తే. వెలికిలఁ బడు నెట్టని కప్ప కడుపువోలె
కుళ్ళుముకొఁగాపు ముఱికిగుంటవోలె

పండి చీము నెత్తురు గాఉప్పుండు నాదు
ఎవ్వ రాసక్తులగుదురో యోచ పడక ౯౭

రంభ:

క. అందపుముద్దలు స్తనములు,
అందాలకొలంకు నాభి, యుదరుపిఱుందుల్
అందంబులీనఁ బ్రమదల
బొందె రతులఁ దేలకుండు మొందుది బ్రతుకే. ౯౮

శుకుఁడు:

క. ఎంతయు బహుదుర్గం
ధాంతరమై చీము క్రిములు నశుచి గలుగు న
త్యంత మలమూత్రపాత్ర ర
మింతురు మూఢమతులు; విరమింతురు జ్ఞానుల్ ౯౯

రంభ:

కరముల్ తామరతూండ్లు; పద్మములు వక్త్రంబుల్,
కనుల్ మీనముల్, పిఱుఁదుల్ తీర్థపుఁటూళ్ళు, చక్కనికనల్
నేత్రంబు, లా కేశముల్ వరశైవాలము, మేనినిగ్గు జలముల్
గాఁగన్ సరస్సొండు చాతురి నిర్మించె విధాత
కామశరతప్తుల్ మున్గిపోయిన్ గనన్. ౧౦౦

శుకుఁడు:

క. నేలయు నీరును దేజము
గాలియు నాకాశము మనుకారమహత్తుల్
గాలు తనూకోశమునకా
మూల విరాజిల్లు దేవుఁ బూజింపవలెకా.

ఇతి శుకరంభాసంవాదము

# శ్రీకృష్ణహృదయామృతము

లీలాశుకుని శ్రీకృష్ణ కర్ణామృతమునుండి

క. రామా! నీ శుభచరిత ర

సామృతమును నీ గుణగణ సంకీర్తనమున్

నీ మధుర పాదసేవయు

వేమఱుఁ బ్రతిజన్మమందు వెలయుత నాకున్.

# శ్రీకృష్ణ హృదయామృతము

తే. ఆత్మవిదులు పూర్వులు మన స్సనెడుగుహను
వెలుఁగు పరమపురుషు నుపాసింత్రుగాక
నే మల యశోద యొడిలోన మెసలుచిన్ని
కృష్ణలీలామృతాబ్ధిఁ గ్రీడింతు మెలమి. ౧

గీ. అమృతరసముల విడి మత్పదాబ్జరసము
ఏల మహానీశ్వరులు భక్తిఁ గ్రోలుదురొకో
యని స్వపాదాబ్జరసపాన మాచరింపఁ
గోరు చిన్నికృష్ణుండు మా కొసఁగు సిరులు. ౨

గీ. వేణునాదంబు తమ్ములై విందుసేయు
నునుపుఁదీయని చూడ్కి ననుగ్రహింపు
మీ వనుగ్రహించినఁ గృష్ణ! యితర మేల
నీ వనుగ్రహింపక యున్న నితర మేల. ౩

నుదుటన్ ముంగురులాడఁగొన్ని మిలికన్నుల్ జుట్టులోఁ గ్రుచ్చియా
బెదబంగన్నులఁ గొంటెచూపులొలయన్ బింబాధరోష్ఠంబుతో
మృదుహాసతీయని వింతచిన్నవులతో మెండైన ధైర్యంబుతో
ముదమారా మోహనమూర్తి మాకనులకుం దోప్పానన త్రింమతెన్.

గీ. తీయఁదనమునకంటెను దీయ నగుచుఁ
గొంటెఁదనమున కంటెను గొంటె యగుచు
ఇట్టి దనరాని యాచిన్ని కృష్ణుబాల్య
మీ మనసు నీడ్చుకొనిపోవు నేమిసేతు. ౫

తే. ఘల్లు రనిమెల్లఁగాఁ జిఱుగజ్జె లదర
తమ్మిపువుఁబోలు లేఁతపాదములతోడ
గజ్జియలమ్రోఁత కనువుగా గానమొలుకు
మురళితో నాదుజీవితమూర్తి వచ్చె. ౬

తే. ఇతఁడె మౌనులమనసు హరించు దొంగ
వాఁడె మదగోపికల మాయవలువదొంగ
ఇతఁడె దేవేంద్రుమద మణఁగించుదొంగ
వాఁడె నా మనసు హరించి పఱచుదొంగ. ౭

తే. తీపితీయన మా చిన్ని దేవుమేను
తీపితీయన మాచిన్ని దేవుమోము
తేనెవల పూనుచిన్నవ్వు తీపితీపి
తీపి తీపి శ్రీకృష్ణుఁడే తీపి తీపి. ౮

తే. సకల నిర్వాణరససుధా ఝరులచేత
నితరరసముల నెల్ల ఖండించి కృష్ణ!
స్వైరముగఁ బాఱెడియమృతజలధు లగుచుఁ
జల్ల నగునీచిఱునవ్వులు జయము గనుత. ౯

తే. తరుణ సుందర మందార తరువుక్రింద
ముకుపుదొండపం డగుమోవి మురళి మోపి
గోవులును గోపికలు గోపకులును గొలువ
మోహనముగఁ బాడెడి గోపమూర్తిఁ గొలుతు. ౧౦

తే. మురళి! శ్రీకృష్ణు చిన్నవ్వు మోముఁదమ్మి
యూప్పుఁదీయని తెలిసిన నేర్పుగత్తె!
మ్రొక్కి ప్రార్థింతు నినుఁగెంపుమోవి మోపి
నప్పుడు నాస్థితి చెవినొంటి హరికిఁ జెపుమి. ౧౧

తే. మదిని గృష్ణుని కిడి శూన్యహృదయ యగుచు
రిత్త కుండలో దధిఁజిల్కరించు రాధ.
రాధ మోముఁ గన్గొనుచు క్షీరంబు పిదుక
నెద్దుఁ గట్టుశౌరియు జగం బేలుఁగాత. ౧౨

## రాసక్రీడాష్టకము

నారికిన్ నారికిన్ మధ్యమై శౌరియున్
శౌరికిన్ శౌరికిన్ మధ్యమై నారియున్
ఈరహిన్ మండలం బేర్పడన్ మధ్యమై
శౌరి మోయించెడున్ జక్కఁగా వేణువున్. ౧౩

నీలమేన్ సూచుచున్ గేక లేయున్ నెమి;
ళ్లోలి హంసల్ భయం బొంది కెందమ్మి పూ
మాలికన్ దాగొనుం భ్రాంతి భీతుల్ చనన్
లీల శ్రీకృష్ణుఁడున్ వేణువూఁదున్ దమిన్. ౧౪

వీణెతో నాట్యచో వింతమై నూఁగుచున్
వీణెతో గజ్జెలన్ నృత్యముల్ సేయుచున్
వీణెతో నాట్యచో నింపుగాఁ బాడుచున్
వేణు వూఁదెన్ దమిన్ గృష్ణుఁడుత్సాహియై. ౧౫

క్రేపులై భూమితల్ క్రీఁగనుల్ చిమ్మఁగన్
గోప గోపాంగనా గోగణారాధ్యుఁడై
గోపికా దైవతా గోపికాకాముకుం
డాపయిన్ వేణువున్ హాయిగా నూఁదెనన్. ౧౬

పూళిపూమాలలన్ నర్తిలన్ దుమ్మెదల్
బేలలై గోపికల్ లీలతోఁ గాఁగిళుల్
వ్రాలి యీయన్, దమిన్ బాహులన్ సోలుచున్
లీల గోపాలుఁడున్ వేణు వూఁదెన్ బళీ. ౧౭

కుందనంపుందళు కొల్కుస్త్రీల్ చుట్టఁగన్
డెందమున్ వైజయంతీరుచుల్ సోకఁగన్
నందబృందావనిన్ భామినీమధ్యుఁడై
విందుగాఁ గృష్ణుఁడున్ వేణుగానం బిడెన్. ౧౮

బాలికల్ తాళముల్ వైచుచుండన్ లయన్
లీలమైఁ గన్బొమల్ వింతగాఁ ద్రిప్పుచున్
బాలికల్ పాడునాపాట లాలించుచున్
లీలగోపాలుఁడున్ వేణు వూఁదెన్ బళీ! ౧౯

ప్రేమతో రాధఁబోల్ స్త్రీలవాకిండ్లలో
వామమై పాతి యాపారిజాతంబులన్
యామునీ యోర్మిలం దానటచ్ఛాయలఁ
శ్రీముకుందుం డొగిన్ వేణు వూఁదెఁ బళీ! ౨౦

తే. కొమరుగోధూళి మెయి నంటి గోపరూపు
పూర్తిగన, గోపబాలురు మూఁగి రాఁగ
సందెవేళ నావులఁ గట్ట సత్వరముగ
నింటియింటి కేగెడుచిన్నికృష్ణు నెంతు. ౨౧

తే. ఇంటిలో వెన్నదొంగ శ్రీకృష్ణుఁ గాంచి
తలుపు బంధించి యొకగోపి తల్లికడకు
నిట్టిపోయి యందును ఱోలఁ గట్టియున్న
కృష్ణుఁ జూచి నోటను మాటలేనిదయ్యె. ౨౨

తే. వెన్నపెరుగుపా లమ్ముగోపిక యొకర్తె
భక్తి మనసును హరిపదాబ్జముల నిలిపి
కేశవ! ముకుంద! మాధవ! కృష్ణ! యనుచు
వాడవాడ గంపను దాల్చి పలుకుచుండె. ౨౩

తే. కృష్ణుఁ డనునేస్గుగున్న బంధించుటకును
సంయమముల మనస్సా యశోదజననిఱోలా
లేక గోపికాలీలలఁతో గాక గాన
మింక నెవి కట్టఁగంబంబు లేజగాన. ౨౪

తే. తమ్మిపువ్వుఁబోలుచేతిలోఁ దమ్మిపువ్వుఁ
బోలుకాలు తమ్మిపువ్వుఁబోల్ మోమునందు
నుంచి వటపత్రశాయియై బసుంతుహారిని
బాలగోపాలు మనసార భక్తిఁ దలఁతు. —౧౬

అమ్మా; యెందుకుఁ గృష్ణ; గిన్నె యిటు తెమ్మా; గిన్నెతో నేమి; క్షీ
రమ్మున్ ద్రావుమఁ; బాలు లేవిప్పుడు; క్షీరం బెప్పుడుండునుఁ; దినాం
తమ్మౌ; యెట్లది వచ్చుఁ; జీకటి; నసక గన్నాసి రాత్రియయ్యెఁ బా
లిమ్మంచున్ గడఁదల్లి పైఁటఁదివురున్ శ్రీకృష్ణుఁడో మున్ మిముకా.

తే. సారమేది యీసమస్త సంసారమందు
శౌరిచరణయుగళపంకజార్చనంబె
ఘోర్వి సంధకారమునందు జ్యోతియేది
మాధవపదారవిందసంస్మరణ మొకటె. —౧౭

తే. ఎన్నియవతారములు పరమేశ్వరునకు
భువనకళ్యాణకరముల్తె పొలుచుఁగాని
గోవులకు గోపకులకును గోపికలకుఁ
గృష్ణుఁడే గాక ముక్తిసం కెవఁ డొసంగె. —౧౮

తే. లీల సంసార జలకేళిఁ దేలుస్త్రీల
నొడలి మాయచీరలఁ గృష్ణుఁ డొగి హరింప
చేయి జుట్టి కన్నాంతలో చీర లయ్యెఁ
దత్త్వ మెఱుఁగని యాగోప తరుణులకును. —౧౯

నీవ యనుగ్రహింతువ పనేమిటి కృష్ణ ! యింకఁ గుణాళుల్
నీవ యనుగ్రహింపవ పనేమిటికృష్ణ ! యింకఁ గుణావళుల్
ధ్యానమువం బ్రియుండె యనురక్తుఁడె యైన విరక్తుఁడైన నిం
దేవిధి వ్యర్థమౌనుగదె యింతుల కుంకుమ పత్త్ర భంగిముల్.

నొసటఁ గస్తురిబొట్టు, పేరురమునందున్ గౌస్తుభాలంకృతుల్
పసయహారముక్కునఁ గొత్తముత్తియము, కేలఁ బిల్లనగ్రోవి, చే
త సువర్ణజ్వాలకంకణంబు, లొడలంతన్ గంధముల్, కంఠసీ
మ సరాల్ సొంపిడ గోపికల్ గొలువ నింపౌకృష్ణుఁ డేపారెడిన్.

భువనాలూగెను, వేదరాశి మొరసెన్, మోడుల్ చిగిర్చెన్,
శిలల్ ద్రవియించెన్. మృగముల్ మొయిన్ మఱచె,
మంచల్ పొక్కె గోపాళి భ్రాంతిఁ బడెన్, మ్రొక్కెరిసంయముల్,
సరిగముల్ దీపించె, నోంకారమున్ వివరింపంబడె
బాలకృష్ణు మురళీ నిక్వాణముల్ తొణ్కెలఁ. 3౨

తే. మనస ! మేల్కొని మేల్కొని మసలుమెపుడు
నేఁటికిఁ గదా కృతార్థత నెగడె నీకు
అనుభవింపు మనుభవింపు మనవరతము
ఇదిగో పూర్ణబ్రహ్మానంద మెదుట నుండె. 33

పొందుచుఁ బొందుచుఁ బొందుఁ బ్రాయంబుచేఁ
జిందుచుఁ జిందుచుఁ వేణుకీర్తి సుధల్
వింనగఁ గ్రోలుచుఁ వింతక్రీఁజూపులఁ
జిందు నానందపూర్ణేంద్రియున్ మ్రొక్కెదఁ. 3౪

తే. ఇక్కడనో యక్కడనో కృష్ణ! యిప్పుడో యప్పుడో
నిన్ను విశ్వసించితిమేని నిశ్చయముగ
మోక్ష సామ్రాజ్యమైన మాత్రమోలత్రాల
నింకఁ జిన్నచిన్నసుఖాళి కేమిలెక్క. ౩౫

తే. చేయి విదలించిపోయి తేఁ బోయినావు
గాని బలవంతముగను, నక్కజ మిదేమి
ఎటుల హృదినుండి దాటిపోయెదవో చూతుఁ
గృష్ణ! యిందు నీపౌరుష మెదో గణింతు ౩౬

తే. ప్రణయరసపూర్ణ గోపికానందితములు
సిద్ధయోగీంద్ర భృంగసంసేవితములు
అమలవందారు బృందార కాశ్రితములు
నైన నీ పదంబులకు జోహార్లు కృష్ణ! ౩౭

సంపూర్ణము.